శ్రీవేఙ్కటేశాయ నమః.

# భాస్కరశతకము

టీకాతాత్పర్యసహితము.



ఇది

కేతవరపు - వేంకటశాస్త్రిచేతఁ

బరిశోధితము



ఆనందముద్రాయంత్రాలయ

ముద్రితము.

1910.

MADRAS:

ఆర్. వేంకటేశ్వర్ అన్డ్ కంపెని

వారిచేఁ బ్రకటితము.

దీని వెల.]  [అణాలు ౪.

# పీఠిక.

ఆర్యులారా! భాస్కరశతకము శతకములలో నెల్ల నగ్రగణ్యమైనదని చెప్పనొప్పు. ఇందున్న నీతులవంటినీతులు మఱియొక దానియం దుండవని నిస్సందేహముగాఁ జెప్పవచ్చు. భాస్కర శతకమునుగూర్చి పెక్కండ్రు పెక్కుగాథల నుడువుచున్నారు. కొందఱు భాస్కరశతకమును రచించినకవు లిరువురని చెప్పుచు నందుల కొకకథ నిట్లు చెప్పుచున్నారు. "ఒకబ్రాహ్మణున కిరువురు కుమారులు. వారలతండ్రి ధనము చాలఁగ నార్జించి కాలధర్మము నొందెను. తరువాత నన్నదమ్ము లిరువురు తండ్రిసొత్తును బంచుకొనుటలోఁ గలహించి రాజునొద్దకుఁ దగవునకుఁ బోయిరి. ఆరాజుపేరు భాస్కరుఁడు. ఆతఁడు కవిత్వమందు మిగులఁ బ్రీతి కలవాఁడు. అతఁడు తనయొద్దకు వచ్చినవా రిరువురినిజూచి 'మీ రేమి చదివినారు' అని యడుగ వారలు 'మేము శాస్త్రములు చదివినాము. తెనుఁగున బాగుగఁ గవిత్వము చెప్పఁగలము' అని పల్కిరి. అంత రాజు వారలమాటలు విని మీరు చెఱియొకగ్రంథము చేసి తీసికొనివచ్చినచో మీతగవు దీర్చెద ననిచెప్పెను. అది విని వారు మా కంతయవకాశము లేదని చెప్పిరి. 'పోనిండు చెఱియొకశతకమైనఁ జేసికొనిరండు' అని రాజు మరలఁ జెప్పెను. అందులకు వారు 'రాజా! మా కంతయవకాశము లేదు. కనుక మేమిరువురము నొక్కశతకము చేసెద' మని చెప్పి రాజు నంగీకరింపఁజేసి యాసభలో శతకమును రచింపఁ

బూని, వారిలోఁ బెద్దవాఁడు పూర్వార్ధమును జిన్నవాఁ డుత్త
రార్ధమును జెప్పుచు నీరీతి శతకమును ముగించిరి. ప్రతిపద్యమం
దును భాస్కరుఁ డనురాజును సంబోధించుచుఁ జెప్పఁబడినదికాన
భాస్కరశతక మని ప్రసిద్ధికెక్కినది. తరువాత రాజు వారల పాం
డిత్యమునకు సంతసించి వారలు కోరినంతధనమిచ్చి వారల పీడ్కొ
లిపెను" అని చెప్పుచున్నయిక్కథను నమ్ముటకుఁ దగిననిదర్శ
నము లేమి లేవు. కనుకఁ జమత్కారముగాఁ గొందఱు కల్పన
చేసియుండవచ్చును. మఱికొందఱు భాస్కరశతకమును రచిం
చినకవు లిర్వురనియు నన్నదమ్ములనియుఁ జెప్పుచు నందులకు నొ
కకథను మఱియొకవిధముగాఁ జెప్పుచున్నారు. "ఒకబ్రాహ్మణు
న కిరువురు పుత్త్రులఁట. వారలతండ్రి చిన్నఁదనముననే కాలధ
ర్మునొందెనఁట. అయినను వారిలోఁ బెద్దవాఁడు బహు
శ్రద్ధతోఁ జదివికొని కవిత్వమున మిగులఁ జతురత గలవాఁడాయె
నఁట. చిన్నవాఁడు చదువక మూర్ఖుఁడై తిరుగుచుండెడివాఁడఁట.
అంత నొకనాఁడా పెద్దవాఁడు తమ్ముని జూచికోపించి "నీవు విద్వాం
సుఁడవైనంగాని యింటికిరానీనని చెప్పి తఱిమివేయ నతఁడు చేయు
నదిలేక కాశికిఁ బోయిశ్రద్ధఁబూని యవలీలనే విద్యలఁ బూర్తిగ
నభ్యసించి కవిత్వమందుఁగూడ నిపుణత్వమును సంపాదించి తిరిగి
యింటికివచ్చి తలుపుతీయుమని యన్నగారిని బిలిచెనఁట. అంత
టఁ బెద్దవాఁడువచ్చి యతనిపాండిత్యమునడిగి తెలిసికొని నీవబద్ధము
చెప్పుచున్నావేమో ? నాయడిగినప్రశ్నలకుఁ దగినట్టులుత్తరము
చెప్పినచో నమ్మెదనని చెప్పి, ఛందోబద్ధముగా ప్రశ్నములడిగిన
నాచిన్నవాఁడు తనయన్నగా రడిగినప్రశ్నములనెల్ల ఛందోబద్ధ
ముగానే యుత్తరము నిచ్చె. రెండవవాఁడు సూర్యోపాసన చేసి

యున్న వాఁడగుటచే భాస్కరుని సంబోధించినందున దీనికి భా
స్కరశతక మని పేరు వచ్చినదఁట. తరువాత నన్నగారు తమ్ముఁ
డిచ్చినయుత్తరములకు సంతసించి గౌరవించి లోనికిఁ గొనిపోయె
నఁట" అని చెప్పుచున్న వారుగూడ నందులకుఁ దగిననిదర్శనములు
గాని వారలయింటిపేరుగాని వారలపేరులుగాని చెప్పరైరి. కను
క నిదికూడ వెనుకటిదానివలెఁ గల్పింపఁబడియే యుండును.
అయిన నందుల నెంతసత్యమో తెలియదు. భాస్కరశతకమును
మొదటినుండి తుదవఱకుఁ జదివినచో నొక్కఁడే రచించెనని శై
లినిబట్టి చదువరులకుఁ దెలియకపోదు. అందుచే నీభాస్కరశ
తకము నొక్కఁడే రచించియుండుననియు, నది సూర్యున కంకి
తంబుగ నొసంగఁబడినదనియుఁ జెప్పుటయె యుచితము. ఈభా
స్కరశతకమును మారన వెంకయ్య అనుకవి రచించినట్లు చెన్న
పురిలో దొరతనమువారి ప్రాచ్యలిఖితభాండాగారములోని గ్రం
థమును బట్టిచూడఁగాఁ దెలియవచ్చుచున్నది. కనుక నిది యేక
కర్తృక మనుటయే యుచితమని విన్నవించుచున్నాను.

శ్రీరామాయ నమః.

శ్రీశారదాంబాయై నమః.

# భాస్కరశతకము.

## టీకాతాత్పర్యసహితము.



గలభాగ్యశాలిఁ గడుఁ జేరఁగవత్తురు తారుదారె దూ
రాగమనప్రయాసమునకై కాఁటు నోర్చియునైన నిల్వ ను
ద్యోగము చేసి రత్ననిలయుండని కాదె సమస్తవాహినుల్
సాగరుఁ జేరుటెల్ల మునిసన్నుత మద్గురుమూర్తి భాస్కరా.

టీ. మునిసన్నుత = మునులచేఁ గొనియాడఁబడుచున్నట్టియు, మద్గురుమూర్తి = నాకుగురుస్వరూపుఁడవైనట్టియు, భాస్కరా= ఓసూర్యుఁడా! మానవులు (అనుక్తపద మధ్యాహారము) దూరాగమనప్రయాసమునకున్ = దూరమునుండి వచ్చుటవలనఁ గలిగినశ్రమకు, ఓర్చియున్=సహించియు, నిల్వన్=నిలుచుటకు, ఉద్యోగము చేసి=ప్రయత్నించి, తారుతారు + ఎ = తమంతటతామె, ఆదటన్ = ప్రేమచేత, శ్రీగలభాగ్యశాలిన్=సంపదగలయైశ్వర్యవంతుని, కడున్=మిక్కిలి, చేరఁగవత్తురు=సమీపింతురు. ఎట్లనఁగా: సమస్తవాహినుల్=నదులన్నియు, సాగరున్ = సముద్రుని, చేరుటెల్లన్=చేరుటంతయు, యోజింపన్ (అనుపదమధ్యాహారము) రత్ననిలయుండని కాదె=రత్నములకు స్థానభూతుఁడనియే కదా.

తా. నదులు, పలుపాట్లుపడియైనను రత్నములకు నిధి యను
నట్టి యపేక్షతో సముద్రుని జేరుచున్నట్లు జనులు బలుకష్టముల
సహించియైనఁ దమంతతామె ప్రేమ గన్పఁబఱుచుచు, భాగ్యవం
తునింటికి వచ్చుచుందురు.

ఉ. అంగన నమ్మరాదు తనయంకెకు రానిమహాబలాఢ్యు వే
భంగుల మాయలొడ్డి చెఱుపం దలపెట్టు, వివేకి యైనసా
రంగధరుం బదంబులు కరంబులుగోయఁగఁ జేసెఁ దొల్లి చి
త్రాంగియనేకముల్ నుడువరానికుయుక్తులుపన్ని భాస్కరా.

టీ. భాస్కరా! తనయంకెకున్=తనవశములోనికి, రానిమహా
బలాఢ్యున్=రానట్టి గొప్పబలవంతునైనను, వేభంగులన్=వేయి
మార్గములచే, మాయలు, పన్ని=కల్పించి, చెఱుపన్ = చెఱుచు
టకు, తలపెట్టున్ = ఆలోచించును. కనుక, అంగనన్=స్త్రీని, న
మ్మరాదు=నమ్మఁగూడదు, తొల్లి=పూర్వమందు, చిత్రాంగి = చి
త్రాంగియనెడి రాజరాజనరేంద్రునిభార్య, సారంగధరున్ = తన
సవతికొడుకగు సారంగధరునిగూర్చి, నుడువన్ = చెప్పుటకు, రాని
కుయుక్తులు=పలనుపడని చెడుయుక్తులను, పన్ని = కల్పించి, పద
మ్ములు=పాదములు, కరంబులు=చేతులు, కోయఁగఁ జేసెన్ = న
ఱకించునటు చేసినది.

తా. చిత్రాంగి బుద్ధిమంతుఁడగుసారంగధరునిపై లేనిపోని
మాయలు పన్ని యాతనికాలుసేతుల నఱకించినట్లు స్త్రీలు తమ
కు లోఁబడనంతబలము గలవానినైనను బలుమాయలు పన్ని
చంపఁజూతురు కనుక వారిని నమ్మఁగూడదు.

పురాణాంశము.

పూర్వము రాజరాజనరేంద్రుఁ డనునొకరాజు గలఁడు. అత

నికి రత్నాంగి యనుభార్య కలదు. ఆమెయం దతని కొకకుమా రుఁడు కలిగెను. అతనిపేరు సారంగధరుఁడు. ఆరాజు తనకుమా రుఁడు యుక్తవయస్కుఁ డగుట చూచి పెండ్లి చేయనెంచి రాకన్నె యలచిత్రపటములఁ దెప్పించెను. వానిలో మిగులనందము గల చిత్రాంగి యనుకన్యకచిత్తరువును జూచి మోహించి యామెను తానె పరిణయము చేసికొనెను. కాని చిత్రాంగి సారంగధరునుండి తనమనస్సును ద్రిప్పుకొనలేక యాతని నెట్లయినను గలియఁజూచు చుండెను. అంత నొకనాఁడు రాజు లేనిసమయమున సారంగధరుఁ డు తనపినతల్లి మేడపై వ్రాలిన తనపావురమును దెచ్చుకొనుట కయి యామెమేడకుఁ బోయెను. అది గని చిత్రాంగి సంతసించి డాయఁబోయి యాతని చేయిపట్టుకొని తనయభీష్టము నెరవేర్పుమ నెను. కాని యాతఁ డందుల కిష్టపడక చేయివిదలించుకొని తన బసకుఁబోయెను. తనకోరిక విఫలమగుటచే నెంతయువంతఁజెంది చిత్రాంగి సారంగధరునిపై లేనినేరములను గల్పించి రాజుతోఁ జెప్పి యాతనికాలుసేతుల నఱకించెను.

ఉ. అక్కఱపాటువచ్చుసమయంబునఁ జుట్టములొక్కరొక్కరిన్
మక్కువనుద్ధరించుటలు మైత్రికిఁజూడఁగయుక్తమే సుమీ
యొక్కట నీటిలో మెరక నోడలుబండ్లను బండ్లనోడలున్
దక్కకవచ్చుచుండుట నిదానము గాదె తలంప భాస్కరా. 3

టీ. భాస్కరా ! అక్కఱపాటు=తగినయవసరము, వచ్చుసమ యంబునన్=వచ్చునట్టి సమయమందు, చుట్టములు=బంధువులు, ఒక్కరొక్కరిన్=ఒకరినొకరు, మక్కువన్ = ప్రేమచేత, ఉద్ధరిం చుటలు=తమకు వచ్చినకష్టములనుండి లేవనెత్తుకొనుటలు, చూ డఁగన్=ఆలోచింపఁగా, మైత్రికిన్ = స్నేహమునకు,యుక్తమేసు

మీ=మంచిదేసుమీ, ఎట్లన, ఒక్కట౯ = ఒకసమయమందు, నీ
టిలో౯=జలములో, ఓడల౯=పడవలమీఁద, బండ్లును, మెరక౯=
మెట్టభూమియందు, బండ్ల౯=బండ్లయందు, ఓడలు౯=పడవలును,
తక్కక=నిలిచిపోక, వచ్చుచుండుట=ఏతెంచుట, తలంప౯=విచా
రింపఁగా, నిదానము=ప్రత్యక్షము, కాదే=కాదా? అనఁగా నగు
నని యర్థము.

తా. ఒక్కొక్కసమయమందు నీటిలోఁ బడవలమీఁద బం
డ్లును మెట్టభూమియందు బండ్లమీఁద నోడలును వచ్చుచుండుట
ప్రత్యక్షము. అట్లే లోకములో బంధువు లవసరము వచ్చినపు
డొకరి నొకరు రక్షించుకొందురు.

చ. అడిగినయట్టియాచకుల కాశ లెఱుంగక లోభవర్తియై
కడపిన ధర్మదేవత యొకానొకయప్పుడు నీదు వాని క
య్యెడలనదెట్లుపాలు తమకిచ్చునె యెచ్చటనైన లేఁగల౯
గుడువఁగ నీనిచోఁ గెరలి గోవులు తన్నునుగాక భాస్కరా. 4

టీ. భాస్కరా! మానవుఁడు, లోభవర్తియై=పేరాశకు వ
శుఁడై, అడిగినయట్టియాచకులయాశలు-అడిగినయట్టి = యా
చించునట్టి, యాచకుల=అర్థులయొక్క, ఆశలు=కోరికలు, ఎఱుం
గక=తెలిసికొనక, కడపిన౯ = ఆయాచకులకీయక పొమ్మని పంపి
నచో, ఒకానొకయప్పుడు=ఒకసమయమందు, వానికి౯=ఆలోభి
మానవునికి, ధర్మదేవత=దైవము, ఈదు = ఈయదు, అయ్యెడ
ల౯ = అట్టిసమయములయందు, అదెట్లు=అదియేలాగుననంటె,
లేఁగల౯=దూడలను, కుడువగ౯ + ఈనిచో౯=కుడుచుకొనీయని
పక్షమున, గోవులు = ఆవులు, కెరలి=తూలిపడి, తన్నును గాక=
తన్నుచుండునుగాని, పాలు తమకు౯ = లేఁగలకు లేకుండ సమస్త

మగుపాలు తామె తీసికోవలెనని తలంచినవారికి, ఇచ్చునె=ఇచ్చు
ట కంగీకరించునా? అనఁగా నీయదు.

తా. మానవులు పేరాసచే దూడల కీయకుండఁగా నావుల
పాలన్నియుఁ దామె పొందవలెనన్న దురభిప్రాయముతో నుం
డఁగా నావు లట్టివారికిఁ బాలియ్యవు. అట్లె మానవుఁడు పేరాసఁ
గలవాఁడై తన్ను యాచించినవారియొక్క కోర్కెలఁ దీర్పకుండఁ
దగిలివేసినచో ధర్మదేవత యాలోభికిఁగూడ నిచ్చుట మానివే
యుచుండును.

చ. అతిగుణహీనలోభికిఁ బదార్థము గల్గిన లేక యుండినన్
మితముగఁగాని కల్మి గలమీఁదటనైన భుజింపఁ డింపుగా
సతమని నమ్మి దేహమును సంపద నేఱులు నిండిపాఱినన్
గతుకఁగఁజూచుఁగుక్క తినకట్టడమీఱక యెందుభాస్కరా.

టీ. భాస్కరా! అతిగుణహీనలోభికిన్—అతి=మిక్కిలి, గుణ=గుణ
ములచేత, హీన=తక్కువగు, లోభికిన్=లుబ్ధునకు, పదార్థము=ద్ర
వ్యము, కల్గినన్=కలిగినప్పుడును, లేక యుండినన్=లేనట్టిసమయ
మందును, మితముగన్=స్వల్పముగానే, భుజించును, కాని, కల్మి=సం
పద, కలమీఁదటనైనన్=కలిగినతర్వాతనైనను, ఇంపుగాన్=బా
గుగా, భుజింపఁడు=తినఁడు, దేహమును=శరీరమును, సంపదన్=ఐశ్వ
ర్యమును, సతముఅని=శాశ్వతమని, నమ్మున్=విశ్వసించును, ఎట్లు
నన్: ఏఱులు=నదులు, నిండి=జలముచేఁ బూర్ణమయి, పాఱినన్=
ప్రవహించినప్పటికి, కుక్క=శునకము, ఎందున్=ఎక్కడనైనను, తన
కట్టడన్=తననియమమును, మీఱక=అతిక్రమింపక, కతుకఁగన్+
చూచున్=నాలుకతోనందుకొనుటకే చూచుచుండును.

తా. కుక్క తనస్వభావమును విడువక నదులు నిండినప్ర

వాహములతోఁ బ్రవహించుచున్నను నానదులయందు నీరు మి క్కిలితక్కువ గా నున్నను నాలుకతోఁ గతుకుచుండునుగాని చ క్కఁగాఁ ద్రావచాలదు. అట్లే లోభియైనవాఁడు తనకు సంపద లున్నను లేకపోయినను మితముగానె యనుభవించునుగాని సం పద లున్నప్పుడైన బాగుగ ననుభవింపఁజాలఁడు.

చ. అదను దలంచి కూర్చి ప్రజ నాదర మొప్ప విభుండు కోరినన్
గదిసి పదార్థ మిత్తు రటు కానక వేగమె కొట్టి తెండనన్
మొదటికి మోసమౌఁ; బొదుగు మూలము గోసిన పాలుగల్గునే
పిదికినఁగాక భూమిఁ బశుబృందము నెవ్వరికైన భాస్కరా. 6

టీ. భాస్కరా! విభుండు = రాజు, అదను=సమయమును, తలంచి=విచారించి, కూర్చి=సంతసింపఁజేసి, ప్రజన్=జనులను, ఆద రము+ఒప్పన్=మన్నన యొప్పునట్లుగా, కోరినన్=ధనసహాయము చేయవలయునని యడుగఁగా, కదిసి=అట్టిప్రభువును సమీపించి, పదార్థము=ద్రవ్యము, ఇత్తురు, ఇచ్చుచుందురు, అటు కానక= ఆసంగతి తెలిసికోక, వేగము+ఎ=శీఘ్రముగానె, కొట్టి=ప్రజలను హింసించి, తెండు=ధనముగొనిరండు, అనన్=అనిపల్కినచో, మొ దటికి మోసము+ఔన్=మొదలె చెడిపోవును (అనఁగా వానియధి కారమునకుఁ జిక్కకవాని విడిచిపోవుదురు) ఎట్లనన్: భూమిన్=భూ మియందు, పశుబృందమున్=పశుసమూహమును, పిదికినఁగాక=నే ర్పుతోఁ బిండినచోఁ బాలుకలుగునుగాని, పొదుగుమూలము= పొదుగుయొక్క మొదటిభాగమును, కోసినన్=కత్తితోఁ జీరినచో, ఎవ్వరికైనన్=ఎట్టివారికయినను, పాలు, కలుగునె=సంభవించునా? అనఁగా సంభవింపవు.

తా. మానవుఁడు పశువులను నేర్పుతోఁ బిదికినచోఁ బాలు వ

చ్చునుగాని యాపొదుగునుకత్తితోఁగోసినచో పాలను బొందలేఁడు. మొదటికిఁ జెడుగు గలుగును. అట్లె రాజు మంచిమాటలచే నడిగినచోఁ బ్రజలు ద్రవ్యము నిచ్చుచుందురు కాని బలాత్కారము చేసి తెండనిన నేమియు నీయకుండఁగ వాని విడిచిపోవుదురు.

చ. అనఘునికైనఁ జేకురు ననర్హుని గూడి చరించినంతలో
మన మెరియంగ నప్పు డవమానము కీడు ధరిత్రియందు నే
యనువుననైనఁదప్పవు యథార్థము; తా నది యెట్టులన్నచో
నినుమునుగూర్చి యగ్ని నలయింపదె సమ్మెటపెట్టు భాస్కరా.

టీ. భాస్కరా! ధరిత్రియందున్=భూమియందు, అనర్హుని=అయోగ్యుని, కూడి=చేరి, చరించినంతలోన్=ప్రవర్తించునట్టిసమయములో, మనము=మనస్సు, ఎరియంగన్=మండునట్లుగా, అప్పుడు=ఆక్షణమందె, అవమానము=తిరస్కారము, కీడున్=హానియును, అనఘునికైనన్=పాపరహితుఁడయినవానికయినను, చేకురున్=సంభవించును. ఏయనువుననైనన్=ఎట్టియుపాయముచేతనైనను, తప్పవు=తప్పిపోవు, యథార్థము=నిశ్చయము, తాన్+అది+ఎట్టులన్నచోన్=అదియేలాగునననఁగా, సమ్మెటపెట్టు=సుత్తిదెబ్బ, ఇనుమునుగూర్చి=ఇనుమునిమిత్తమయి, అగ్నిన్=ఇనుముతోఁ గూడియున్న యగ్గిని, అలయింపదె=బాధింపదా? అనఁగా బాధించునని యర్థము.

తా. ఇనుముతోఁగూడ వసించుచుండుటచేత నగ్నిహోత్రునకుఁగూడ సమ్మెటపోటువలన బాధ కలుగుచున్నట్లు, భూమియందయోగ్యునితోఁ గూడినమంచివానికి నయితము అవమానము కీడు సంభవించుచుండును. ఏయుపాయముచేతనైనను దప్పవు.

చ. అలఘుగుణప్రసిద్ధుఁ డగునట్టిఘనుండొకఁ డిష్టుఁడైతనున్
వలచియొకించు కేమిడిన వానికి మిక్కిలిమేలు చేయుఁగా

తెలిసి కుచేలుఁ డొక్కకొణిగె దెండటుకుల్ దనకిచ్చినన్ మహా
ఫలదుఁడు కృష్ణుఁ డత్యధిక భాగ్యములాతనికీఁడె? భాస్కరా!

టీ. భాస్కరా! అలఘుగుణప్రసిద్ధుఁడు-అలఘు = గొప్పవగు, గుణ=గుణములచే, ప్రసిద్ధుఁడు=విఖ్యాతిపొందినవాఁడు, అగునట్టిఘనుఁడు= అయినట్టిమహాత్ముఁడు, ఒకఁడు, ఇష్టుఁడు+ఐ=హితుఁడయి, తనున్=తన్నును,వలచి=ప్రేమించి, ఒకించుక=కొంచెమును,ఏమిడినన్=ఏమియిచ్చినప్పటికిని,వానికిన్=ఆయిచ్చినవానికి, మిక్కిలి=మిగుల, మేలు=ఉపకారము, చేయుఁగా=చేయుచుండునుగదా, తెలిసి=భగవంతుఁడని తెలిసికొని, కుచేలుఁడు=కుచేలుఁడను నొక ముని, ఒక్కకొణిదెండు = ఒక్కచేరెడు, అటుకులే, తనకున్=కృష్ణునికి కనుటు,ఇచ్చినన్=ఈయఁగా,మహాఫలదుఁడు=గొప్పఫలమునిచ్చెడి, కృష్ణుఁడు=కృష్ణమూర్తి, అతనికిన్=ఆకుచేలునికి, అత్యధికభాగ్యములు=ఎక్కువయైశ్వర్యములు,ఈఁడే=ఈయఁడా? అనఁగా,నిచ్చెనని యర్థము.

తా. కుచేలుఁడు భక్తితోఁ జేరెడటుకులు కొనిపోయి కృష్ణునికీయఁగా నతం డతనికి మిగులగొప్పయైశ్వర్యము నిచ్చెను. అట్లె గుణవంతుఁడు తనకిష్టుఁడై యుండి తానతనికిఁ గొంచె మిచ్చినప్పటికి నతఁడుకొంచెమిచ్చినవానికే యధిక ఫలమునిచ్చును.

పురా. కుచేలుఁడు: ఇతఁడొక ముని. ఇతఁడు బలరామకృష్ణులతోఁ గలిసి కాశీపురమున సాందీపునియొద్ద నధ్యయనము చేసినవాఁడు. ఇతనికి నిరువదియేడుగురు కుమారులు గలరు. ఇతఁడు మిగుల బీదతనముచే బాధపడుచుఁ దుదకుఁ బ్రాణము విసికి ధనాశచేఁ దన కుఁజిన్ననాఁటి స్నేహితుండయినకృష్ణునియొద్దకుఁ బోయి యతండు గొనిపోయినయటుకులనీయఁగా నతం డతనియభిప్రాయమునుగని

పెట్టి యూయటుకులఁ బుచ్చికొని వాని కధికైశ్వర్యముల నిచ్చెను.

చ. అవనివిభుండు నేరుపరికయ్యెఁ జరియించినఁ గొల్చువారలె
ట్లవగుణులైన నేమి పనులన్నియుఁ జేకురు వారిచేతనే
ప్రవిమలనీతిశాలి యగురాముని కార్యము మర్కటంబులే
తవిలి యొనర్పవే? జలధిఁ దాఁటి సురారులఁ ద్రుంచి భాస్కరా. 9

టీ. భాస్కరా! అవనివిభుండు = రాజు, నేరుపరియై = చాతుర్యముగలవాఁడై, చరియించినన్ = ప్రవర్తించినచో, కొల్చువారలు = సేవకులు, ఎట్లు = ఎటువంటి, అవగుణులు = చెడుగుణములు గలవారు, అయిననేమి = అయినప్పటికిని, వారిచేతనే = అట్టిదుర్గుణులచేతనే, పనులన్నియున్ = కార్యములన్నియును, చేకురున్ = సమకూడును. ఎట్లన: ప్రవిమలనీతిశాలి - ప్రవిమల = స్వచ్ఛమైన, (అనఁగా దోషరహితమైన), నీతిశాలి = రాజనీతిచే నొప్పుచున్నవాఁడు, అగురాముని కార్యము = అయినట్టిరామచంద్రుని కార్యమును, మర్కటంబులే = కోఁతులే, తవిలి = పూనుకొని, జలధి = సముద్రమును, దాఁటి = లంఘించి, సురారులన్ = రాక్షసులను, త్రుంచి = చంపి, ఒనర్పవే = చేయలేదా? అనఁగా నెరవేర్చిన వని యర్థము.

తా. రాజనీతియందు నేర్పుగలరాముఁడు, సముద్రలంఘనము, రక్కసుల నురుమాడుట మొదలగు కార్యముల నీచములగు కోఁతులచేతనే చేయించుకొనినట్లు, నేర్పరి యగురాజు అల్పులగు సేవకులచేతనే గొప్పకార్యములఁ జేయించుకొనఁగలఁడు.

ఉ. ఆదర మింత లేక నరుఁ డాత్మబలోన్నతి మంచివారికిన్
భేదము సేయుటం దనదుపేర్మికిఁ గీడగు మూలమెట్లమ
ర్యాద హిరణ్యపూర్వకశిపుం డనుజుండు గుణాఢ్యుఁడైన ప్ర
హ్లాదున కెగ్గుచేసి ప్రళయంబును బొందఁడె మున్ను భాస్కరా.

టీ. భాస్కరా! నరుఁడు=మానవుఁడు, ఆదరము=ప్రేమ, ఇంత లేక=కొంచెమైనను లేక, ఆత్మబలోన్నతిన్ = తనబలసమృద్ధిచేత, మంచివారికిన్=సజ్జనులకు, ఖేదము=బాధ, చేయుటన్=చేయుట చేత, తన పేర్మికిన్=తన పెంపునకు, కీడుఅగున్=అపాయముసంభవించును, మూలము=కారణము-దృష్టాంతము, ఎట్లు=ఏలాగున, మున్ను=పూర్వమందు, అమర్యాదన్=చెడువృత్తిచే, హిరణ్యపూర్వకశిపు = హిరణ్యశబ్దము పూర్వమందుఁగల కశిపుశబ్దవాచ్యుఁడు, అన్ దనుజుండు=అనెడి రాక్షసుఁడు, గుణాఢ్యుఁడు=గుణములకుప్ప, ఐనప్రహ్లాదునకున్=అయినట్టిప్రహ్లాదునకు, ఎగ్గు=కీడు, చేసి, ప్రళయంబును=నాశనమును, పొందఁడె=పొందలేదా, అనఁగాఁ జచ్చెనని యర్థము.

తా. పూర్వమ దురాత్ముఁడగుహిరణ్యకశిపుఁడు కోపముతో గుణనిధియగు ప్రహ్లాదునకు నపకారము చేసి మృతిపొందెను. అట్లె లోకమున మనుష్యుఁడు కొంచెమైన ప్రేమ లేకుండ బలహీనుఁడగు మంచివానిని బాధించినచోఁ దప్పక చచ్చును.

పురా. హిరణ్యకశిపుఁడుకశ్యపునివలనదితియందు జనించినవాఁడు. వాఁడు మిగులక్రూరుఁడు. విష్ణువుతోఁ బరమశత్రుత్వమును వహించినవాఁడు. వీనికిఁ బ్రహ్లాదుఁడను పుత్త్రుఁడుకలఁడు. అతఁడు సదాహరిని భజించుచుండువాఁడు. తనశత్రు వగుహరిని సేవించుచుండుటచే హిరణ్యకశిపువు కుమారుని మిగులనిరోధించి హరిని స్మరించుట విడువవలయునని బోధించెను. గాని యాతఁడట్లు చేయఁడాయె. అందుచే హిరణ్యకశిపుండు కుమారుని జంపింప ననేకములగు నుపాయములు పన్నెనుగాని ఫలించినవికావు. అంతనొకనాఁడుతాను స్వయముగఁ గుమారుని జంపనుంకించియుండఁ

గా హరి నరసింహాకృతిఁ దాల్చి వాని సంహరించెను.

ఉ. ఆరయ నెంత నేరుపరి యై చరియించిన వానిదాపునన్
గౌరవ మొప్పఁ గూర్చునుపకారిమనుష్యుఁడు లేక మేలు చే
కూరద దెట్లు? హత్తుగడ గూడునె చూడఁ బదారువన్నెబం
గారములోననైన వెలిగారముఁ గూడకయున్న భాస్కరా. 11

టీ. భాస్కరా! ఆరయన్=ఆలోచింపఁగా, మానవుఁడు (అధ్యాహారము), ఎంత నేరుపరి=మిగుల నేర్పుగలవాఁడు, అయి చరియించిన్=అయి ప్రవర్తించుచున్న వానిదాపునన్=వానిదగ్గఱ, గౌరవము=గొప్పతనము, ఒప్పన్=ఒప్పునట్లుగా, కూర్చునుపకారి మనుష్యుఁడు=సంఘటించెడియుపకారియైన మానవుడు, లేక, మేలు, చేకూరదు=కలుగదు, అది ఎట్లు=అది యేలాగుననఁగా, చూడన్=ఆలోచింపఁగా, పదారువన్నెబంగారము లోననైనన్=మేలిమిబంగారులోనైనను, వెలిగారము=వెలిగారమనెడుపొడి, కూడకయున్నన్=కలియకున్నచో, హత్తుగడ గూడునె=అదుకుకొనునా? అనఁగా హత్తుకొనదని యర్థము.

తా. మేలిమిబంగారమైనను హత్తుకొనునపుడు వెలిగారముండనిచో హత్తుకొనదు. అట్లే మనుజుఁడు తానెంత నేర్పరి యైనను వానిదగ్గఱ గౌరవము సమకూర్చునట్టియుపకారి లేనిచో మేలు సంప్రాప్తము కాదు.

ఉ. ఈక్షితి నర్థకాంక్ష మది నెప్పుడు పాయక లోకు లెల్ల సం
రక్షకుఁడైన సత్ప్రభుని రాకలఁ గోరుదు రెందుఁ జంద్రికా
పేక్షఁ జెలంగి చంద్రుఁ డుదయించువిధంబునకై చకోరపుం
బక్షులు చూడవే యెదురుపారము దంబును బూని భాస్కరా.

టీ. భాస్కరా! ఈక్షితిన్=ఈభూమియందు, ఎల్లలోకులు=మను

ష్యులందఱు, అర్థకాంక్షన్ = ధనమందలియాశను, ఎప్పుడు=ఎల్లప్పుడు, పాయక=విడువక, సంరక్షకుఁడు=తమ్ముఁ బాలించెడివాఁడు, ఐన సత్ప్రభునిరాకలు = అయినట్టి రాజుయొక్క యాగమనములను, ఎందున్=ఏసమయమందైనను, అపేక్షించుచుందురు. ఎట్లనన్,: చకోరపుంబక్షులు= వెన్నెలపులుఁగులు, చంద్రికాపేక్షన్ = వెన్నెలయందుఁ దమకుఁగల యాశక్తిచే, చెలంగి=ఉండి, చంద్రుఁడు= చందమామ, ఉదయించువిధంబునకున్ అయి=చంద్రునియుదయముకొఱకయి, అపారముదంబును=అధికముగా నానందమును, పూని=పొంది, ఎదురుసూడవే=ప్రతీక్షింపలేదా, అనఁగాఁ బ్రతీక్షించుచున్నవని యర్థము.

తా. చకోరపక్షులు వెన్నెలల కాసించి మిగులసంతసము చెందుచుఁ జంద్రునియుదయముకొఱకు నిరీక్షించుచుండును. అట్లె మానవులు ధనమును మదిలో నాసించి తమ్ముఁ బోషించెడి ప్రభువుయొక్క రాకనిమిత్త మెదురుచూచుచుందురు.

ఉ. ఈజగమందుఁ దామనుజుఁ డెంతమహాత్మకుఁడైనఁ దైవమా
తేజముతప్పఁ జూచునెడఁ ద్రిమ్మరికోల్పడు, నెట్లనన్ మహా
రాజకుమారుఁడై రఘురాముఁడుగాల్నడఁ గాయలాకులున్
భోజనమైతగన్వనికిఁ బోయిచరింపఁడె? మున్ను భాస్కరా. 13

టీ భాస్కరా! మనుజుఁడు=మానవుఁడు, తాన్, ఈజగమందున్= ఈలోకమునందు, ఎంతమహాత్మకుఁడు=ఎంతగొప్పవాఁడు, ఐనన్ =అయినప్పటికిని, దైవము=ఈశ్వరుఁడు, ఆతేజము=ఆప్రభావము, తప్పన్=తప్పునట్లుగా, చూచునెడన్ = చూచునట్టిసమయమునందు, త్రిమ్మరి= దేశసంచారియయి, కోల్పడున్=సమస్తముపోఁగొట్టుకొనును, ఎట్లనన్: మహారాజకుమారుఁడు=రాజాధిరాజగుదశర

ఘునికుమారుఁడు,ఐనరఘురాముఁడు=అయినట్టి రామచంద్రుఁడు, కాయలు=ఫలములను, ఆకులు=పత్రములను, భోజనముఅయి=ఆహారమయి, తగఁగ్=ఒప్పునట్లుగా, కాల్నడన్=కాలినడకతో, వనికిన్=అడవికి, పోయి=వెళ్లి, చరింపఁడే=తిరుగలేదా? అనఁగాఁ దిరిగెనని యర్థము.

తా. దశరథమహారాజుకొడుకగు రాముఁడు కాలినడకతో నడవికేగి కాయలను నాకులను దినుచుఁ దిరుగవలసివచ్చెను. కావున మనుజుఁడు తానెంతటివాఁడయినను దైవానుగ్రహము లేనప్పుడు సమస్తమును బోఁగొట్టికొని దేశములయందు సంచరించుచుండును.

చ. ఉరుకరుణాయుతుండుసమయోచితమాత్మఁదలంచియుగ్రవా
క్పరుషతఁజూపినన్ఫలము గల్గుట తథ్యముగాదెయంబుదం
బురిమినయంతనే కురియకుండునె వర్షము లోకరక్షణ
స్థిరతరపౌరుషంబున నశేషజనంబు లెఱుంగ? భాస్కరా!

టీ. భాస్కరా! ఉరుకరుణాయుతుఁడు—ఉరు=గొప్పదైన, కరుణా=దయతో, యుతుండు=కూడినవాఁడు, సమయోచితము=ఆకాలమునకుఁ దగినయాలోచన, ఆత్మన్=మనస్సునందు, తలంచి=తలపోసి, ఉగ్రవాక్పరుషతన్—ఉగ్ర=భయంకరమగు, వాక్=మాటలయొక్క, పరుషతన్=కఠినత్వమును, చూపినన్=కనఁబఱిచినను, ఫలము=అతనివలనిలాభము, గల్గుట=సంభవించుట, తథ్యము కాదె=నిశ్చయమేకదా? ఎట్లనన్, అంబుదము=మేఘము, ఉరిమినయంతనే=ఉరిమినంతమాత్రముననే,లోకరక్షణస్థిరతరపౌరుషంబునన్—లోక=జనులను, రక్షణ=రక్షించుటయందు; స్థిరతర=మిక్కిలి స్థిరమైన, పౌరుషంబునన్=మగంటిమిచేత, అశేష

జనంబులు=జనులందఱు, ఎఱుంగక = ఎఱుఁగునట్లు, వర్షము= వాన, కురియక ఉండునే=కురిపించకుండునా? అనఁగాఁ గురిపించు నని యర్థము.

తా. మేఘుఁడు మొదట నురిమి యాధ్వనిచేత లోకులకు భయము పుట్టించుచునున్నను దరువాత జనులందఱు మిగుల నానందించునట్లు వర్షింపక మానఁడు. అట్లె కరుణాళుఁడు సమయమును బట్టి యొక కఠినవాక్యమును బలికినను దరువాతఁ దప్పక ఫలము కలిగించును.

చ. ఉరుగుణవంతుఁ డొడ్లు దన కొండపకారము సేయునప్పుడుం
బరహితమే యొనర్చు నొకపట్టున నైనను గీడుఁ జేయఁగాఁ
నెఱుఁగఁడు నిక్కమే కదయ దెట్లనఁగవ్వముఁబట్టి యెంతయుం
దరువఁగఁజొచ్చినం బెరుఁగు తాలిమినీయదె ? వెన్న భాస్కరా.

టీ. భాస్కరా! ఒడ్లు=పరులు, తనకున్, ఒండుఅపకారము= ఒకచెడుగు, చేయునప్పుడున్ = చేసినసమయమందయినను, ఉరుగుణవంతుఁడు = గొప్పగుణములుగలవాఁడు, పరహితము + ఏ= పరుల కుపకారమునే, ఒనర్చున్ = చేయుచుండును, ఒకపట్టునన్ ఐనను =ఒకసమయమునందైనను, కీడు=హానిని, చేయన్ కాన్=చేయుటకు, ఎఱుఁగఁడు=తెలియఁడు, నిక్కము+ఏ కద=ఇది నిజమే కాదా, ఎట్లనన్, పెరుఁగు, పరులు(అధ్యాహారము), కవ్వమును, పట్టి=చేతఁగొని, ఎంతయున్ = మిక్కిలి, తరువఁగన్ జొచ్చినన్= తన్ను మథించుచున్నను, తాలిమిన్=శాంతముచే, వెన్నన్=వెన్నను, ఈయదె=ఈయలేదా? అనఁగా నిచ్చుచున్నదని యర్థము.

తా. పెరుఁగు, మానవులు తన్నుఁగవ్వముచేఁగొని మథించుచున్నను, వారికపకారము చేయక తనయందున్న వెన్నను బ్రో

వుచేసి తన్ను మథించువారలకు నిచ్చుచున్నది.. అట్లె మంచిగుణములు కలవాడు తనకితరులు హానిచేయుచున్నను దాను వారికి మేలే చేయునుగాని యపాయముచేయఁడు.

చ. ఉరుబలశాలి నంచుఁ దను నొల్లనియన్యపతివ్రతాంగనా
సురతముగోరెనేని కడ సుమ్మది భూతికిఁ, బ్రాణహాని యౌ;
శిరములుగూల రాఘువునిచే దశకంఠుఁడు ద్రుంగిపోవఁడే
యెఱుఁగక సీతకాసపడి యిష్టుల భృత్యులఁగూడిభాస్కరా. 16

టీ. భాస్కరా! మానవుఁడు, (అధ్యాహారము), ఉరుబలశాలిన్ అంచున్ = గొప్పబలముచే నొప్పుచున్నవాఁడనని, తనున్ = తన్ను, ఒల్లనియన్యపతివ్రతాంగనాసురతము—ఒల్లని = ఇష్టపడని, అన్యపతివ్రతాంగనా = మఱియొకపతివ్రతాస్త్రీయొక్క, సురతము = సంగమమును, కోరెన్ + ఏని = కోరినచో, అది = ఆకోరుట, భూతికిన్ = ఐశ్వర్యమునకు, కడ సుమ్ము = నాశనముచేయునది సుమీ, ప్రాణహాని = ప్రాణాపాయము, ఔన్ = అగును, ఎట్లన, దశకంఠుఁడు = రావణుఁడు, ఎఱుఁగక = తెలిసికోక, సీతకున్ = రాముని భార్యయగు సీతకోసము, ఆసపడి = అపేక్షించి, ఇష్టులన్ = హితులను, భృత్యులన్ = సేవకులను, కూడి = వారలతోఁ గూడికొని, రామునిచే = రామచంద్రునిచే, శిరములు = తలలు, కూలన్ = తెగిపడఁగా, త్రుంగిపోవఁడే = చావలేదా? అనఁగాఁ జచ్చెనని యర్థము.

తా. రావణుఁడు కావరముచేఁ గ్రిందుమీఁదుచూడక సీతను కామించి హితులతోను, సేవకులతోను రణరంగమునఁ జచ్చెను కావున మానవుఁడు నేను బలశాలినని గర్వించి తన్ను వలవని కాంతపొందు కోరినచోఁ దనయైశ్వర్యము ప్రాణములు పోవును.

ఉ. ఊరకవచ్చుఁ బాటుపడ కుండినన్గాని ఫలం బదృష్ట మే

పారఁగఁగల్గు, వానికిఁ బ్రయాసము నొందిన దేవదానవుల్
వారలటుండఁగా నడుమ వచ్చిన శౌరికిఁ గల్గెఁగాదె శృం
గారపుఁబ్రోవులక్ష్మియును గౌస్తుభరత్నము రెండు భాస్కరా.

టీ. భాస్కరా! అదృష్టము=భాగ్యము, ఏపారఁగన్=వృద్ధిచేయుచుండునట్లు, కల్గువానికిన్=కలమనుష్యునకు, పాటు=శ్రమ, పడక, యుండినన్=చెందకపోయినను, ఫలంబు=లాభము, ఊరక=మిన్నక, వచ్చున్=వచ్చుచుండును. ఎట్లనన్, ప్రయాసమున్=ఆయాసము, ఒందిన దేవదానవుల్ = పొందినట్టి సురాసురులు, వారలు=ఆ దేవతలు రాక్షసులు, అటుండఁగా=ప్రత్యేకముగానుండఁగా, శృంగారపుఁబ్రోవు=సొగసులకుప్ప యగు, లక్ష్మియును=లక్ష్మీదేవియును, కౌస్తుభరత్నము=కౌస్తుభమాణిక్యము, రెండున్=ఈ రెండును, నడుమన్=మధ్యను, వచ్చినశౌరికిన్ = వచ్చినట్టి విష్ణువునకు, కల్గెఁగాదె=దొరకెనుగదా.

తా. రాత్రింబవళ్ళు కష్టములొందెడు సురాసురు లుండఁగా వారికిఁ గాక సముద్రములో నుద్భవించినలక్ష్మియును కౌస్తుభమాణిక్యమును శ్రమపడకుండ మధ్య వచ్చిన విష్ణువునకు సంప్రాప్తమైనవి. అట్లె గొప్పయదృష్టముకలవానికి ప్రయాసమక్కఱలేకయే ఫలము గలుగుచుండును.

పురా. దేవతలును రక్కసులును సముద్రమును భాండముగాను వాసుకి యనుసర్పరాజును రజ్జువుగను మందరపర్వతమును కవ్వముగను జేసి యమృతమునిమిత్తము మథించుచుండిరి. అంత నమృతము జనింపకమునుపు మిగులఁ శ్రేష్ఠము లగు వస్తువు లందుఁ బుట్టినవి. వానిలో లక్ష్మీదేవిని, కౌస్తుభమాణిక్యమును విష్ణువు పరిగ్రహించెను.

ఉ. ఊరక సజ్జనుం డొదిగియుండిన నైన దురాత్ముకుండు ని
ష్కారణ మోర్వలేక యపకారము చేయుట వానివిద్యగా
చీరెలు నూఱుటంకములు చేసెడివైనను బెట్టెనుండఁగా
జేరి చినింగిపోఁ గొరుకుచిమ్మట కేమిఫలంబు? భాస్కరా!

టీ. భాస్కరా! సజ్జనుండు=మంచివాఁడు, ఊరక=పరులజోలి
కిఁబోకుండ, ఒదిఁగి=అడఁగి, ఉండినన్ ఐనన్=ఉండినప్పటికిని,
దురాత్మకుండు=దుర్జనుఁడు, నిష్కారణము = హేతువులేకుండ,
ఓర్వలేక=సహింపలేక, అపకారము=సజ్జనున కపకారము చేయు
ట, వానివిద్య కా=వానియొక్క విద్యయె కదా? ఎట్లనన్: చీరె
లు=వస్త్రములు, నూఱుటంకములు = నూఱేసిమొహరీలు, చేసె
డివి= వెలగలవి, ఐనను=అయినప్పటికిని, పెట్టెన్=పెట్టెలో, ఉండఁ
గా=ఉన్నప్పుడు, చేరి=వానిని సమీపించి, చినింగిపో=ఆచీరెలు చి
నిఁగిపోవునట్లు,కొరుకుచిమ్మటకున్=కొరుకుచున్న చిమ్మట యనుపురు
గునకు, ఏమిఫలంబు=ఏమిఫలంబు గలదు, అనఁగా నేమియు ఫల
ము లేదని యర్థము.

తా. బట్టలు నూఱుమొహరీలు వెలచేయుచున్నవైనను బె
ట్టెలో నొదిఁగియున్నప్పటికిని దన కేమియు ఫలము లేకపోయినను
జిమ్మటపురుగా వస్త్రముల ముక్కలుగాఁ గొరుకుచుండును. అట్లె
తనజోలికి రాకుండ మంచివాఁ డొకమూల నుండినను దనకు ఫల
ము లేకపోయినను నిష్కారణముగ దుర్జనుఁ డామంచివాని కప
కారము చేయుచుండును.

ఉ. ఎట్టుగఁ బాటుపడ్డ నొకయించుక ప్రాప్తము లేక వస్తువుల్
పట్టుపడంగ నేరవు; నిబద్ధి సురావళిఁ గూడి రాక్షసుల్
గట్టువెకల్చి పాల్కడలి గవ్వము చేసి మథించి రంతయున్

వెట్టియె కాక యేమనుభవించిరి వారమృతంబు? భాస్కరా!

టీ. భాస్కరా! ఎట్టుగన్ = ఏరీతిగా, పాటుపడ్డన్ = కష్టపడినను, ఒకయించుక = కొంచెము, ప్రాప్తము = పొందఁదగిన యదృష్టము, లేక, వస్తువుల్ = పదార్థములు, పట్టుపడంగన్ నేరవు = లభింప నేరవు, నిజద్ది = సత్యమె. ఎట్లనన్ : రాక్షసుల్ = దానవులు, సురావళిన్ = దేవతాసమూహమును, కూడి = వారితో స్నేహము చేసి, గట్టు = మందరపర్వతమును, పెకల్చి = ఊడఁదీసి, కవ్వము చేసి = కవ్వముగనొనర్చి, పాల్కడలిన్ = పాలసముద్రమును, మథించిరి = తరిచిరి, అంతయున్ = ఈ రాక్షసులు చేసినకష్టమంతయు, వెట్టియె కాక = ఫలము లేనిదే కాని, వారు = ఆరాక్షసులు, అమృతంబును, ఏమి అనుభవించిరి = ఏమి పానము చేసినారు. అనఁగాఁ బానముచేయ లేదని యర్థము.

తా. రాక్షసులు దేవతలతో సఖ్యము చేసి మందరపర్వతమును ద్రవ్వి తెచ్చి కవ్వముగాఁజేసి పాలసముద్రమును కష్టపడి తరిచినను వారికి సుంతేనియు నమృతము తక్కినది కాదు. కావున లోకములో మానవుఁడెంతకష్టపడినను దా ననుభవింపఁదగినయదృష్టము లేకపోయినప్పుడు తాను బడ్డకష్టమునకు ఫలము చూదలేఁడు.

చ. ఎడపక దుర్జనుం డొరులకెంతయుఁ గీ డొనరించుఁగాని యే
యెడలను మేలు సేయఁ డొకయించుకయైనను జీడపుర్వు దాఁ
జెడఁదిను నింతెకాక పుడిసెండుజలంబిడి పెంపనేర్చునే
పొడవగుచున్నపుష్పఫలభూరుహమొక్కటినైన? భాస్కరా!

టీ. భాస్కరా! దుర్జనుండు = చెడ్డవాఁడు, ఎడపక = విడువక, ఒరులకున్ = పరులకు, ఎంతయున్ = మిక్కిలి, కీడు = అపాయము, ఒనరించున్ కాని = చేయునుగాని, ఏయెడలను = ఏసమయమందైనను, ఒక

యించుకైనను=కొంచెమైనను, మేలు=ఉపకారమును, చేయఁ
డు=చేయఁదలంపఁడు. ఎట్లనఁగా: చీడపురుగు=చీడపురుగు, తాన్=తా
ను, చెడన్=చెడిపోవునట్లుగా, తినున్=ఫలవృక్షములను దినుచుండు
నుగాని, పుడిసెండుజలము=చేరెడునీళ్లను, ఇడి=పోసి, పొడవు=వృద్ధి
ని, అగుచున్నపుష్పఫలభూరుహమున్—అగుచున్న=పొందుచున్న,
పుష్ప=పూవులతోను, ఫల=పండ్లతోను, కూడుకొనిన, భూరు
హమున్=చెట్టును, ఒక్కటిన్ ఐనన్ = ఒకదానినైనను, పెంచన్
నేర్చునే=వర్ధింపఁగలదా? అనఁగా వర్ధింపలేదని యర్థము.

తా. చీడపురుగు బాగుగ వృద్ధిపొందుచున్న పండ్లచెట్లను ము
క్కలుగఁ గొరికి తినుచుండునుగాని చేరెడునీరుపోసి యొకచెట్టునై
నను బెంచలేదు. అట్లె దుర్జనుఁడు పరులకెంతయుఁ గీడుచేయఁగ
లఁడుకాని యొకనికయినను మేలుచేయలేఁడు.

ఉ. ఎడ్డెమనుష్యుఁ డేమెఱుఁగు నెన్నిదినంబులు గూడియుండినన్
దొడ్డగుణాఢ్యునందుఁ గలతోరపువర్తనలెల్లఁ బ్రజ్ఞ నే
ర్పడ్డవివేకిరీతి రుచిపాకము నాలుక గాకెఱుంగునే?
తెడ్డది కూరలోఁ గలయఁ ద్రిప్పుచుండిననైన భాస్కరా.

టీ. భాస్కరా! ఎడ్డెమనుష్యుఁడు=మూర్ఖుఁడగుమనుజుఁడు,
ఎన్నిదినంబులు=ఎన్నిరోజులు, కూడియుండినన్=కలసియున్నప్పటి
కిని, దొడ్డగుణాఢ్యునందున్=మంచిగుణములచే నొప్పుచున్నపురు
షునియందు, కలతోరపువర్తనలెల్లన్=కలిగియున్న మంచినడతలన్ని
టిని, ప్రజ్ఞచేన్=బుద్ధిచే, ఏర్పడ్డవివేకిరీతిన్—ఏర్పడ్డ=ప్రసిద్ధికెక్కిన,
వివేకిరీతిన్=జ్ఞానివలెను, ఏమియెఱుంగును=ఏమి తెలిసికొనఁగలఁ
డు? అనఁగాఁ దెలిసికోలేఁడని యర్థము. ఎట్లన: రుచిపాకము=రుచి
యొక్క సౌకర్యము, నాలుకగాక=నాలుకతప్ప, తెడ్డు=కొయ్యగరి

టి కూరలలోన్, కలయన్=అంతటా, త్రిమ్మరుచున్నను=తిరుగుచున్నప్పటికిని, అది=ఆతెడ్డు, ఎఱుంగునే=తెలిసికొనఁగలుగునా? తెలిసికొనలేదనుట.

తాఁ బాగుగ వండినట్టికూరలయొక్క చవిని నాలుక తెలిసికొనునుగాని యెల్లప్పుడు కూరలలోఁ దిరుగుచున్నను తెడ్డారుచిని దెలిసికొనలేదు. అట్లే గుణాఢ్యునందుఁ గలమంచివర్తనలు వివేకి తెలిసికొనునుగాని, ఆగుణాఢ్యుతో నెంతకాలము సహవాసముచేసినను మూర్ఖుఁడు తెలిసికొనేరఁడు.

ఉ. ఎప్పుడదృష్టతామహిమ యించుక పాటిలునప్పు డింపుసొం
పొప్పుచునుండుఁగాక యది యొప్పనిపిమ్మట రూపుమాయుగా
నిప్పన నంటియున్న యతినిర్మలినాగ్ని గురుప్రకాశముల్
దప్పిననట్టిబొగ్గునకుఁ దా నలు పెంతయుఁ బుట్టు భాస్కరా.

టీ. భాస్కరా! ఎప్పుడు=ఏసమయమునందు, అదృష్టతామహిమ=భాగ్యముయొక్క పెంపు, ఇంచుక=కొంచెము, పాటిలునప్పుడు=పొందుచున్నసమయమునందు, ఇంపుసొంపు=చక్కఁదనముయొక్క యతిశయము, ఒప్పుచునుండుఁగాక=ప్రకాశించుచుండునుగాని, అది=ఆయదృష్టము, ఒప్పనిపిమ్మటన్=విడిచిపోయినతరువాత, రూపు=తొలుతటిరూపము, మాయుఁగా=నశించునుగదా. అనఁగా రూపము మాఱియుండునుగదా? ఎట్లనన్: నిప్పనన్=నిప్పునందు, అంటియున్న ... ప్రకాశముల్ – అంటియున్న=పొందియున్న, అతినిర్మలిన=మిక్కిలిస్వచ్ఛమైన, అగ్ని=అగ్నిహోత్రునియొక్క, గురు=గొప్పదగు, ప్రకాశముల్=కాంతులు, తప్పినన్=విడిచిపోయినచో, అట్టిబొగ్గునకున్=అటువంటిబొగ్గునకు–అనఁగా మొదటఁ బ్రకాశించుచున్నబొగ్గునకు, నలుపు=నల్లనికాంతి,

తాన్ = తాను, ఎంతయున్ = మిక్కిలి, పుట్టున్ = కలుగుచుండును..

తా. బూడిదలో అగ్నియొక్క ప్రకాశము కలిగినప్పుడు ప్రకాశిం
చెడు నాయగ్నికాంతి నశించినతోడనే మిక్కిలినల్లనిదగుచున్నది.
అట్లె యదృష్టమున్నంతకాలము మానవుడు ప్రకాశించునుగాని
యది లేనప్పుడు మిగులమాలిన్యరూపము చెందును.

ఉ. ఏగతిఁ బాటుపడ్డఁ గలదే భువి నల్పునకున్ సమగ్రతా
భోగము భాగ్యరేఖ గలపుణ్యునకుం బలెఁ? భూరిసత్త్వసం
యోగమదేభకుంభయుగళోత్థితమాంసము నక్కకూన కే
లాగు ఘటించు? సింహము దలంచినఁ జేకురుఁగాని భాస్కరా.

టీ. భాస్కరా! ఏగతిన్ = ఏరీతిచేత, పాటుపడ్డన్ = కష్టపడుచు
న్నను, భువిన్ = భూమియందు, అల్పునకున్ = నీచునకు, భాగ్యరేఖ =
భాగ్యలక్షణము, గలపుణ్యునకుంబలెన్ = కలయట్టిపుణ్యాత్మునకువలె
నే, సమగ్రతాభోగము = నిండయినసౌఖ్యము, కలదే = కలుగునా?
(అనఁగాఁ గలుగదని యర్థము.) ఇట నేకాకును వ్యతిరేకమునంద
వచ్చినది. ఎట్లనఁగా, భూరి ... మాంసము = భూరిసత్త్వ = గొప్పబల
ముయొక్క, సంయోగ = కూడికగల, మదేభ = మదపుటేనుఁగుయొ
క్క, కుంభయుగళ = కుంభద్వయమునందు, ఉత్ + స్థిత మాంసము
= పుట్టినట్టిమాంసము, సింహము, తలంచినన్ = అపేక్షించినచో,
చేకురుఁగాని = లభించునుగాని, నక్కకూనకున్ = నక్కపోతునకు,
ఏలాగు = ఏరీతిగా, లభించును = సంప్రాప్తమగును? అనఁగా సంప్రా
ప్తముకాదని యర్థము.

తా. మదపుటేనుఁగు కుంభస్థలములయందున్న మాంసము
నపేక్షించినచో సింహమునకు లభించునుగాని యెంతప్రయాసపడి
నను నక్కపోతునకు లభింపదు. అట్లె నిండయినసౌఖ్యము భాగ్య

వంతునకు లభించునుగాని యెంతకష్టపడినను నీచునికి లభింప నేరదు.

వ్యా. నక్కపోతు కేలాగు ఘటించు అని ప్రాచీనపాఠముకాని సూ. ఉదంతబుకారాంతములకు షష్ఠ్యర్థకకువర్ణము పరమగునప్పుడు నగాగమమ్ము నిత్యమను సూత్రప్రకారము దుష్టమైనది కనుక నక్కకూనకు అని పఠించునవీనులపాఠమే యుచితమని తోఁచెడిని.

ఉ. ఏడ ననర్హుఁ డుండు నటకేగు ననర్హుఁడు నర్హుఁడున్నచోఁ
జూడఁగనొల్లఁ డెట్లన నశుద్ధగుణస్థితి నీఁగ పూయముం
గూడినపుండుపై నిలువఁగోరినయట్టులు నిల్వనేర్చునే
సూడిదఁబెట్టునెన్నుదుటిచొక్కపుఁగస్తురిమీఁద భాస్కరా.

టీ. భాస్కరా! అనర్హుఁడు=అయోగ్యుఁడు, ఏడనుండున్=ఎచ్చటనుండునో, అనర్హుఁడు=అయోగ్యుఁడు, అటకున్=ఆస్థలమునకు, ఏగును=పోవుచుండును, అర్హుఁడు=మంచివాఁడు, ఉన్నచోన్=ఉన్నట్టిస్థలమును, చూడఁగనొల్లఁడు=చూచుటకయిన నిష్టపడఁడు. ఎట్లన: ఈఁగ, అశుద్ధగుణస్థితిన్=పరిశుద్ధమగుగుణము లేనివస్తువులయందుండుటచే, పూయమున్=చీమును, కూడినపుండుపైన్=కలయట్టికురుపుమీఁద, నిలువన్=నిలుచుటకు, కోరినయట్లు=ఇష్టపడినట్లు, సూడిద=కానుకగా, (అనఁగా నలంకారార్థమనుట) పెట్టునెన్నుదుటిచొక్కపుఁగస్తురిమీఁదన్—పెట్టు=ఉంచుకొనిన, నెన్నుదుటిచొక్కపుఁగస్తురిమీఁదన్=చక్కనినుదుటియందున్న యందమైనకస్తూరిపయి, నిల్వఁగనేర్చునే=నిలువఁగలదా? అనఁగా నిలువలేదని యర్థము.

తా. ఈఁగ మంచివాసనగల కస్తురియొద్దకుఁ బోక చెడువాసన గలచీముతో నిండియున్న కురుపుమీఁదనే వ్రాలుట కిష్టపడునట్లు

అయోగ్యుఁడు మంచివానికడకుఁ బోనొల్లక యయోగ్యునొద్దకే పోవుటకు నిష్టపడుచుండును.

ఉ. ఏల సమస్తవిద్యల నొకించుకభాగ్యము గల్గియుండినన్
జాలు ననేకమార్గముల సన్నుతికెక్క నదెట్లొకో యనన్
రాలకు నేడ విద్యలు తిరంబుగ దేవరరూపు చేసినన్
వ్రాలి నమస్కరించి ప్రసవంబులు వెట్టరె మీఁద భాస్కరా.

టీ. భాస్కరా! సమస్తవిద్యలన్=అన్నివిద్యలతో, ఏల=ఏమి ప్రయోజనము, (ప్రయోజనము లేదని యర్థము) ఒకించుక=కొంచెము, భాగ్యము=అదృష్టము, కల్గి ఉండినన్=ఉన్నచో, అనేకమార్గములన్=పెక్కురీతులచే, సన్నుతికిన్ ఎక్కన్=స్తోత్రము చెందుటకు, చాలున్=సరిపోవును. అది ఎట్లు ఒకో అనన్ = అదియే లాగుననఁగా: విద్యలు=చదువులు, రాలకున్=శిలలకు, ఏడన్=ఎచ్చోట—ననఁగా విద్యలు లేవని యర్థము. తిరంబుగన్=నిలుకడగా, దేవరరూపు=సాక్షి దేవతావిగ్రహములుగా, చేసినన్=చేసినచో, (మానవులు) సభక్తిపూర్వకము, వ్రాలి=భూమిమీఁదపడి, నమస్కరించి=నమస్కారము చేసి అనఁగా దండప్రణామము చేసి, ప్రసవంబులన్=పుష్పములను, మీఁదన్=ఆశిలావిగ్రహముపై, వెట్టరే=ఉంచరా? అనఁగా నుంచెదరు.

తా. రాళ్లు విద్యలనభ్యసింపకపోయినను వానియదృష్టవశమున దేవతారూపము నొంది యుండుటచే నమస్కారములకుఁ బాత్రములగుచున్నవి. కావున మానవులు భాగ్యముండినయెడ ననేకమార్గములచే స్తుతింపఁబడుదురుగాని కేవలము చదువుకొనుటవలనఁ గాదు.

ఉ. ఒక్కఁడె చాలు నిశ్చలబలోన్నతుఁడెంతటికార్యమైనఁ దాఁ

జక్క నొనర్చుఁ గౌరవులసంఖ్యలు పట్టినధేనుకోటులం
జిక్కఁగనీక తత్ప్రబలసేన ననేకశిలీముఖంబులన్
మొక్కపడంగఁ జేసి తుదముట్టఁడె యొక్కకిరీటి భాస్కరా.

టీ. భాస్కరా ! నిశ్చలబలోన్నతుఁడు=చలింపనిభుజబలముచే నధికుఁడయినవాఁడు, ఒక్కఁడె=తాను, ఎంతటికార్యము ఐనన్= ఎంతగొప్పకార్యమైనను, చక్కన్=బాగుగా, ఒనర్చున్=చేయును. ఎట్లనన్: ఒక్కకిరీటి=అర్జునుఁ డొక్కఁడె, అసంఖ్యలు=లెక్కలేని, కౌరవులు=కురువీరులు, పట్టినధేనుకోటులన్=తోలుకొనిపోవుచున్నగోసమూహములను, చిక్కన్ ఈక = కౌరవులకు లోఁబడకుండ, తత్ప్రబలసేన=వారిగొప్పసైన్యమును, అనేకశిలీముఖంబులన్=వెక్కబాణములచే, మొక్కపడంగఁ జేసి = జయించి, తుదముట్టఁడె=కార్యము నిర్వహించుకొనలేదా? అనఁగా నిర్వహించుకొనె ననుట.

తా. కౌరవవీరులు వెక్కమంది యేకీభవించి విరటునిగోగణములను దోలుకొనిపోవుచుండఁగా నర్జునుఁ డొక్కఁడే పోయి వారినోడించి గోవులనన్నిటిని మరలించికొనివచ్చెను. అట్లె స్వకీయభుజబలము గలఘనుఁడు తా నెంతటికార్యమైన నెరవేర్పఁగలఁడు.

పురా. పాండవు లజ్ఞాతవాసవత్సరమును వెళ్లించుటకయి నొరు లెఱుఁగకుండ మాఱువేషంబులతో విరటుని సేవించుచుండిరి. అంత దుర్యోధనుఁడు 'పాండవులు విరటునొద్ద నున్నట్టులు తెలిసికొని, తాను విరటునిగోవుల నపహరించి పాండవులను బయటఁ బెట్టి పూర్వము చేసికొన్నప్రతిజ్ఞప్రకారము తిరిగి ద్వాదశవత్సరంబులు వనవాసము చేయునట్లు' చేయవలెనని నిశ్చయించి, ప్రబలసైన్యములతోఁ బోయి విరటునిగోగణములఁ దనపురికి మరలించెను. అప్పు డర్జునుఁడు గడువుదినములు

ముగియుటను గనిపెట్టి యొక్కఁడె పోయి కౌరవవీరుల జయించి గోగణములను దోలికొనిపోయి విరటున కొప్పగించెను.

ఉ. కట్టడ దప్పి తాము చెడుకార్యముఁ జేయుచునుండిరేనిదోఁ
బుట్టినవారినైన విడిపోవుట కార్యము దౌర్మదాంధ్యముం
దొట్టినరావణాసురునితో నెడఁబాసి విభీషణాఖ్యుఁ డా
పట్టున రాముఁ జేరి చిరపట్టము గట్టుకొనండె? భాస్కరా?

టీ. భాస్కరా! కట్టడ=మర్యాద, తప్పి=విడిచి, తాము=అనఁగా మానవులనుట, చెడుకార్యమున్=చెడ్డపనిని, చేయుచున్=ఒనర్చుచు,ఉండిరేని=ఉన్నచో, తోఁబుట్టినవారిన్ ఐనన్=తనసోదరునినైనను,విడి=విడిచి,పోవుట=దూరముగాఁబోవుట, కార్యము=మంచిపని, దౌర్మదాంధ్యమున్=చెడుమదమువలనఁగలిగిన గుడ్డితనమును, తొట్టినరావణాసురునితోన్ = పొందినట్టిరావణుఁడను రక్కసునితో,ఎడఁబాసి=దూరమయి, విభీషణాఖ్యుఁడు=విభీషణుఁడనుపేరు గలవాఁడు, ఆపట్టునన్=ఆసమయమందె, రామున్=రామచంద్రుని, చేరి=శరణు సొచ్చి, చిరపట్టము=శాశ్వతమైనలంకాధిపత్యము, కట్టుకొనండె=కట్టుకొనలేదా? అనఁగాఁ గట్టుకొనెననుట.

తా. రావణుఁడు మదోన్మత్తుఁడయి చెడ్డకార్యము చేయుటచే విభీషణుఁడు తనయన్న యని యోజింపక వాని విడిచి రాముని శరణు సొచ్చి లంకాధిపత్యము పొందెను. కావునఁ జెడుకార్యము లాచరించెనేని తనసోదరునైనను విడిచిపోవలయును. అట్లు పోయినచోఁ దప్పక లాభము చెందును.

ఉ. కట్టడ యైనయట్టినిజకర్మము చుట్టుచువచ్చి యేగతిం
బెట్టునొ పెట్టిన ట్లనుభవింపక తీఱదు; కాళ్లు మీఁదుగాఁ

గిట్టక వ్రేలుఁడంచుఁ దల క్రిందుగఁ గట్టిరె యెవ్వరైన నా
చెట్టున గబ్బిలంబులకుఁ జేరినకర్మము గాక భాస్కరా.

టీ. భాస్కరా! కట్టడ=విధివిహితము, ఐనయట్టినిజకర్మము=అయినట్టిపురాకృతకర్మము, చుట్టుచున్=తన్నావరించుచు, వచ్చి, నగతిన్ పెట్టెను+ఒ=ఎట్టియిడుములఁగలుగఁజేయునో, పెట్టినట్లు=అది కలుగఁజేసినట్లు, అనుభవింపకతీఱదు=పొందకతీరదు. ఎట్లనఁగా: ఆచెట్టునన్ గబ్బిలంబులకున్=ఆచెట్టున వ్రేలాడుచున్నగబ్బిలములకు,చేరినకర్మము కాక=పొందినపూర్వకర్మము తప్ప,ఎవ్వరైనన్=ఏమనుష్యులైనను, కిట్టక = వానియందలికోపముచే సహింపక, కాళ్లుమీఁదుగా=కాళ్లు మీఁదుగాను, తల క్రిందుగాన్=తల క్రిందుగాను,వ్రేలుఁడు=వ్రేలుచుండుఁడు,అంచున్ =అనిపలుకుచు, కట్టిరె=బంధించినారా? అనఁగా బంధింపలేదని యర్థము.

తా. గబ్బిలములు పరులెవ్వరు తమ్ముఁ దల క్రిందుగా వ్రేలుఁడని నిర్బంధింపకపోయినను తమపురాకృతకర్మముచేతనె యట్లు వ్రేలాడుచున్నవి. కావున విధివిహిత మగుకార్యము తన్నెట్లు నడువుమని చెప్పునో అట్లు నడువక తీఱదు.

ఉ. కట్టడ లేనికాలమునఁ గాదు శుభం బొరు లెంతవారు చే
పట్టిననైన మర్త్యునకు భాగ్యము రా దనుటెల్లఁ గల్ల కా
దె ట్టని పల్కినన్; దశరథేశవసిష్ఠులు రామమూర్తికిన్
బట్టము కట్టఁగోరి రది పాయక చేకురెనో టుని? భాస్కరా!

టీ. భాస్కరా! మర్త్యునకున్ =మనుష్యునకు, కట్టడ=దైవముచేఁ జేయఁబడిననియమము, లేనికాలమునన్=లేనిసమయమందు, శుభంబు=మంగళము, కాదు=కలుగనేరదు. ఒరులు=పరులు, ఎంతవారు=ఎంతగొప్పవారు, చేపట్టినన్ ఐనన్=చేరఁదీసినప్పటికి

ని, భాగ్యము=సంపద, రాదు=కల్గదు, అనుట+ఎల్లన్=అని చెప్పు టయంతయు,కల్ల కాదు=అబద్ధము కాదు. ఎట్టనిన్=ఏలాగని, పల్కి నన్=అడిగినచో, దశరథశవసిష్ఠులు=దశరథుఁడును వసిష్ఠమహర్షి యును, రామమూర్తికిన్=రామచంద్రునకు, పట్టముకట్టన్=ప ట్టాభిషేకముచేయుటకు, కోరిరి=ఆలోచించిరి, అది=పట్టాభిషేక ము, పాయక=విఘ్నము చెందక, చేకురెనో టు=జరిగినదా? అనఁ గాఁ జరుగలేదని యర్థము.

తా. రామచంద్రునికిఁ బట్టాభిషేకము చేయుటకు వసిష్ఠుఁడు దశరథుఁడు నెంతప్రయత్నము చేసినను జెడిపోయెనుగాని నెరవేర లేదు. కాన మనుజునకు దైవనిర్ణిత మగు కాలము రానప్పుడు శు భములు కలుగవు. ఎంతధనవంతుఁడు చేపట్టినను భాగ్యము కలు గదు.

ఉ. కానక చేరఁ బోల దతికర్ముఁడు నమ్మిక లెన్ని చేసినం
దా నది నమ్మి వానికడకై డాయఁగఁబోయిన హాని వచ్చు; న
చ్చోనది యెట్లనంగొఱఁకుకై చూపుచు నొడ్డినబోను మేలుగాఁ
~~దానిని~~ కాన కాసపడి పోవుచుఁగూలదె కొక్కు భాస్కరా.

టీ. భాస్కరా! అతికర్ముఁడు=దుష్టకార్యములుచేయువాఁడు- అనఁగా పాపాత్ముఁడు, ఎన్ని నమ్మికలు = ఎన్నివిశ్వాసములు, చేసి నన్=కనఁబఱిచినను, కానక=యోచింపకుండ, చేరఁబోలదు=దగ్గఱ కుఁబోఁగూడదు. తాన్=తాను-మానవుఁ డనుట,అది, నమ్మి=వి శ్వసించి, వానికడన్=ఆపాపాత్ముఁడున్నచోటికి, డాయఁగన్=చేరు నట్లు,పోయినన్=పోయినచో, అచ్చోన్=అస్థలమందు, హాని=అ పాయము, వచ్చున్=సంభవించును. అది ఎట్లనన్=అది యేలాగు ననఁగా,కొక్కు=పందికొక్కు, కొఱఁకు=ఎరను,చూపుచున్=కనఁ

బఱుచుచు, మేలుగాన్=లాభముగా, ఒడ్డిన=పన్నినట్టి, బోనును, బోను+అని=తన్నుఁ జంపెడియొక యంత్ర మని, కానక=తెలిసికోక, ఆసపడి=అపేక్షపడి, పోవుచున్ కూలదే=చావదా? అనఁగాఁ జచ్చునని యర్థము.

తా. ఎలుక తన కాహారమును జూపుచు నొడ్డినట్టిబోనును బోనని తెలిసికొనక పేరాసతోఁ బోయి యందుఁ బడి చచ్చుచున్నది. కాన పాపాత్ముఁ డెన్నినమ్మకములు చేసినను దెలిసికోకుండ వానిదగ్గఱకుఁ బోఁగూడదు. పోయినచోఁ దప్పక యపాయము కలుగును.

ఉ. కానిప్రయోజనంబు సమకట్టదు తా భువి నెంతవిద్యవాఁ
డైనను దొడ్డరాజుకొడుకైన నదెట్లు? మహేశుపట్టి వి
ద్యానిధి సర్వవిద్యలకుఁదానె గురుండు వినాయకుండు దాఁ
నేనుఁగురీతి నుండియు నదేమిటి కాడఁడు పెండ్లి? భాస్కరా!

టీ. భాస్కరా! భువిన్=భూమియందు, తాన్, ఎంతవిద్యవాఁడు=ఎంతవిద్య కలవాఁడు, ఐనను=అయినప్పటికిని, దొడ్డరాజుకొడుకు=గొప్పప్రభువుయొక్క కుమారుఁడు, ఐనన్ = అయినప్పటికిని, కానిప్రయోజనంబు=అనుకూలింపనికార్యము, సమకట్టదు=కానేరదు. ఎట్లనన్: మహేశుపట్టి=ఈశ్వరునికుమారుఁడును, విద్యానిధి=చదువులకు స్థానభూతుఁడును, సర్వవిద్యలకున్=అన్ని విద్యలకు, తానె=తానొక్కఁడె, గురుండు=ఉపదేశించువాఁడును, వినాయకుండు=అయినట్టి విఘ్నేశ్వరుఁడు, తాన్=ఆవిఘ్నేశ్వరుఁడు, ఏనుఁగురీతిన్=ఏనుఁగువలెనే, యుండియు=(అనఁగా నేనుఁగంతబలము కలవాఁడయియుండియు, అనఁగా గజవదనుఁడని తాత్పర్యము) పెండ్లి=వివాహము, ఏమిటికిన్=ఎందుచేత, ఆడఁడు=చేసికొనఁడు.

తా. విఘ్నేశ్వరుఁ డీశ్వరునికుమారుఁడును సర్వవిద్యలకు స్థానభూతుఁడును నందఱికి గురువును నేనుఁగంతటిబలిము కలవాఁడు నైనను బెండ్లాడ లేకపోయెను. అట్లె లోకములో మానవుఁడు తాను విద్వాంసుఁడైనను గొప్పరాజుయొక్క కుమారుఁడైనను దైవ మనుకూలింపనికార్యమును జేసికొనలేఁడు.

ఉ. కామితవస్తుసంపదలు గల్గుఫలం బొరులాసపడ్డచో
నేమియుఁ బెట్టఁడేని సిరి యేటికి? నిష్ఫల మున్నఁ బోయినన్
భ్రామికపడ్డలోకులకుఁ బండఁగ నే మది యెండిపోవఁగా
నేమిఫలంబు? చేఁదు విడ దెన్నఁటికైన ముసిండి భాస్కరా.

టీ. భాస్కరా! ఒరులు=ఇతరులు, కామితవస్తుసంపదలు=కోరినపదార్థములయొక్క సమృద్ధులు,కల్గుఫలంబు=కలిగియుండుటవలనఁ గలుగుఫలమును,ఆసపడ్డచోన్=అపేక్షించినప్పుడు,ఏమియున్=కొంచెమైనను,పెట్టఁడేని=ఐశ్వర్యవంతుఁ డగుజనుఁ డియ్యకపోయెనేని, సిరి=వానియొక్కసంపద, ఏటికిన్=ఎందుకు,ఉన్నన్=ఉన్నప్పటికిని, పోయినన్=నశించినప్పటికిని, నిష్ఫలము=వ్యర్థము, ముసిండి=ముసిణిచెట్టు, ఎన్నఁటికయినన్=ఎప్పటికైనను, చేఁదు=విషమును, విడదు=విడిచిపెట్టదు. అది=అటువంటిముసిఁడిచెట్టు, పండఁగన్ ఏమి=పండినప్పుడయినను, ఎండిపోవఁగాన్=ఎండిపోవునప్పుడయినను,భ్రామికపడ్డలోకులకున్=దానిపండ్లను జూచిభ్రాంతి నొందియున్నలోకులకు, ఏమిఫలంబు=ఏమిలాభము, అనఁగాలాభము లేదని యర్థము.

తా. ముష్టిచెట్టు ఎంతకాలమునకైనను జేఁదు విడువకుండునప్పుడా చెట్టు పండినను ఎండినను భ్రాంతిచే దాని నాశ్రయించియున్నమానవుల కేమియుఁ బ్రయోజనము లేదు. అట్లె యైశ్వర్య

వంతుఁడు తనవల్లననుండి ఫల మపేక్షించియున్న జనుల కేమియు నీయనిసమయమున వానియైశ్వర్య మున్నను నశించినను సమానమే.

ఉ. కారణ మైనకర్మములు ♦ కాక దిగం బడ వెన్నిగొందులం
దూరిన నెంతవారలకుఁ ♦ దొల్లి పరీక్షితు శాపభీతుఁ డై
వారిధి నొప్పనుప్పరిగె ♦ పై బదిలంబుగ డాఁగి యుండినం
గ్రూరభుజంగదంతహతిఁ ♦ గూలఁడెలోకు లెఱుంగ? భాస్కరా!

టీ. భాస్కరా! ఎన్నిగొందులన్=ఎన్ని సందులలో, దూరినన్=దాగియున్నప్పటికిని, ఎంతవారలకున్=ఎంత గొప్పవారికిని, కారణము=అనుభవింప హేతువు, ఐనకర్మముల్ = అయినట్టికర్మములు, కాక=అనుభవము కాకుండ, దిగన్ పడవు=నశింపవు. ఎట్లనన్ : తొల్లి=కలియుగాదిని, పరీక్షితు=పరీక్షిత్తను రాజు, శాపభీతుఁడుఐ=మునిశాపమువలన భయపడినవాఁడై, వారిధిన్=సముద్రమందు, ఒప్పనుప్పరిగపైన్ = ఒప్పుచున్న మేడపైని, పదిలంబుగన్=భద్రముగా, డాఁగియుండినన్=దాఁగియున్నప్పటికిని, క్రూర ... హతిన్–క్రూర=భయంకరమైన, భుజంగ=సర్పముయొక్క, దంత=కోరలయొక్క, హతిన్=దెబ్బచేత, లోకులు=జనులు, ఎఱుంగన్=తెలిసికొనునట్లుగా, కూలఁడె=చావలేదా ? అనఁగాఁ జచ్చెననియర్థము.

తా. పరీక్షిన్మహారాజు మునీశ్వరుం డిచ్చినశాపమునకు భయపడి సముద్రములో మేడ గట్టించుకొని నివసించినప్పటికిని బాముకాటుచేతఁ జావవలసినవాఁ డాయెను. కావున నెంతవారికిఁ దా ననుభవింపవలసినకర్మము లెచ్చటదాఁగినప్పటికి ననుభవింపక తీఱదు.

పురా. పరీక్షిత్తు: ఇతఁడభిమన్యున కుత్తరయందుఁ బుట్టిన వాఁడు. అర్జునునిమనుమఁడు. ఇతఁడు ధర్మరాజాదులతరువాత కురుదేశములఁ బాలించినవాఁడు. ఒకనాఁ డితఁ డడవికి వేఁటకై పోయి తిరిగివచ్చుచు మార్గమధ్యమునఁ దపంబు చేయునొకముని మెడలో నాసమీపమునఁ జచ్చిపడియున్నపామును బడవైచెను. పిమ్మటఁ గొంతవడి కామునియొక్క కుమారుఁడు వచ్చి యది కని పట్టి యీతుంటరిపని చేసినవాఁడు పాముచేత నవశ్యము చచ్చుఁ గాక యని శపించెను. అందులకుఁ బరీక్షిత్తు భయపడి సముద్రములో నొకమేడ కట్టించుకొని మిగులజాగ్రత్తతో మసలుచుం డెను కాని యొకదినమున నొకబ్రాహ్మణుఁ డిచ్చినపండును వాస నచూడఁగ నదియె పామయి వానిని గఱచిచంపెను.

చ. కులముననక్కడక్కడ నకుంఠితధార్మికుఁ డొక్కఁడొక్కఁడే
కలిగెడుఁగాక పెందఱుచుగఁ గల్గఁగ నేరరు; చెట్టుచెట్టునన్
గలుగఁగ నేర్చునే గొడుగుకాములు చూడఁగ నాడనాడ నిం
పలరఁగనొక్క టొక్కటి నయంబునఁ జేకురుఁగాక భాస్కరా.

టీ. భాస్కరా! అకుంఠితధార్మికుఁడు=గొప్పధర్మబుద్ధి కలవాఁడు, కులమునన్=వంశమందు, అక్కడక్కడన్=ఒక్కొకచోట, ఒక్కఁడొక్కఁడె=ఒక్కొకఁడె, కలిగెడుఁగాక=సంభవించునుగాని, పెందఱుచు=మిక్కిలియధికముగా, కల్గనేరరు=సంభవింపరు. చూడఁగన్=ఆలోచింపఁగా, గొడుగుకాములు=గొడుగుకఱ్ఱలు, నాడనాడన్=అక్కడక్కడ, ఇంపు అలరన్=ఒప్పునట్లుగా, నయమునన్=నియమముగా, ఒక్కటొక్కటి=ఒక్కొక్కటియే, చేకురున్ కాక=సంభవించునుగాని, చెట్టుచెట్టునన్=ప్రతివృక్షమునందు, కలుగఁగ నేర్చున్+ఏ=సంభవించునా? అనఁగా సంభవింపవని యర్థము.

తా. గొడుగువలె నమర్చుకొనుటకుఁ దగినకఱ్ఱలొక్కొకచెట్టు నందు నొక్కొకటిచొప్పున నుదయించునుగాని ప్రతివృక్షమునం దును గలుగవు. అట్లె ధర్మబుద్ధి గలవాఁడు వంశమునందు నొక్కఁడే జనించునుగాని తఱుచుగాఁ గలుగరు.

ఉ. క్రూరమనస్కులౌ పతులఁ గొల్చి వసించినమంచివారికిన్
వారిగుణంబె పట్టి చెడువర్తన వాటిలు; మాధురీజలో
దారలు గౌతమీముఖమహానదు లంబుధిఁ గూడినంత నే
క్షారముఁ జెందవే మొదలికట్టడ లన్నియుఁదప్పి భాస్కరా.

టీ. భాస్కరా! క్రూరమనస్కులు=కఠినచిత్తులు, ఔ పతులన్=అయినట్టిప్రభువులను, కొల్చి=సేవించి, వసించినమంచివారికిన్=ఉన్నట్టిమంచిజనులకు, వారిగుణంబె=ఆక్రూరప్రభువులస్వభావమె, పట్టి=అలవాటుపడి, చెడువర్తన=చెడ్డనడవడి, వాటిలున్=సంభవించును. ఎట్లనన్: మాధురీజలోదారలు-మాధురీజల=తియ్యఁదనముతోఁ గూడినజలముచేత, ఉదారలు=గొప్పవగు, గౌతమీనదులు-గౌతమీ=గోదావరి, ముఖ=మొదలుగాఁగల, మహానదులు=గొప్పనదులు, అంబుధిన్=సముద్రమును, కూడినంతనే=సంగమించినంతనే, మొదలికట్టడలన్నియున్ = తొలుతటిమాధుర్యము మొదలగుగుణములన్నియు, తప్పి=విడిచిపెట్టి, క్షారమున్=ఉప్పఁదనమును, చెందవె = పొందకుండునా? పొందు నని యర్థము.

తా. తియ్యనిజలములతో నిండియున్నగోదావరి మొదలగుమహానదులు సముద్రమును గూడినంతమాత్రముననే మొదటిగుణముల విడిచి యుప్పఁదనమును చెందుచున్నవి. అట్లె క్రూరబుద్ధి గలప్రభువును గొల్చినమంచివారుకూడ తమమంచిగుణముల వదలి యాప్రభువులగుణములఁ బొంది చెడునడత గలవారగుదురు.

విశేషాంశములు:—ఈపద్యమున మొదటిపాదములో "క్రూరమనస్కుఁడౌ పతిని" అని కొందఱు పఠించుచున్నారు. కాని ఈపద్యము ద్వితీయచరణములో వారిగుణంబెపట్టి॥ అని బహువచనాంత సర్వనామము ప్రయోగింపఁబడినందున నచ్చటఁ గూడ "క్రూరమనస్కులౌ పతులు" అని బహువచనాంతప్రయోగమే మిగుల నుచితము. మఱియు నీపద్యములోనే "మాధురీజలం బారయ గౌతమీముఖమహానదులు" అని పఠించునప్పుడు "మాధురీజలంబు" అనుపదమున కెచ్చట నన్వయము లేదు. కనుక "మాధురీజలోదారలు గౌతమీముఖమహానదులు" అని పఠించుటయె మంచిది.

ఉ. గిట్టుట కేడఁ గట్టడ లిఖించిన నచ్చటఁగాని యొండుచోఁ
బుట్టదు చావు; జానువులపున్కల నూడిచి కాశిఁ జావఁగా
ల్గట్టినశూద్రకుం భ్రమలఁ గప్పుచుఁ దద్విధి గుఱ్ఱమౌచు నా
పట్టునఁ గొంచు మఱ్ఱికడఁ బ్రాణము తీసెఁగదయ్య భాస్కరా.

టీ. భాస్కరా! గిట్టుటకున్=చచ్చుటకు, ఏడన్=ఎక్కడ, కట్టడ=నియమము, లిఖించినన్=బ్రహ్మవ్రాసినట్టయిన, అచ్చటన్ కాని=ఆస్థలమందె కాని, ఒండుచోన్=మఱియొకస్థలమందు, చావు=మరణము, పుట్టదు=కలుగదు. ఎట్లనన్: కాశిన్=కాశీపురమునందు, చావన్=చచ్చుటకు, జానువులపున్కలన్=మోకాఁటిచిప్పలను, ఊడిచి=తొలఁగించి, కాల్గట్టినశూద్రకున్=నిశ్చయము చేసికొనినశూద్రకమహారాజును, భ్రమలన్=మాయలచే, కప్పుచున్=ఆవరించుచు, తద్విధి=ఆదైవము, గుఱ్ఱము ఔచున్=ఒకగుఱ్ఱమురూపమును దాలిచి, ఆపట్టునన్=ఆమరణకాలము సమీపించునప్పటికి, కొంచున్=మీఁదనెక్కించుకొనిపోవుచు, మఱ్ఱికడన్=మఱ్ఱిచెట్టునొద్ద,

ప్రాణమున్ = జీవమును, తీసెఁగదయ్య = తీసెనుగదా.

తా. శూద్రకుఁడు కాశీపురమునఁ జావ నిశ్చయించుకొని మోఁ కాలిచిప్పలనూడఁదీసి యచ్చటనే నివసించియుండఁగా దైవ మొక గుఱ్ఱమై వాని నెక్కించుకొనిపోయి యొకమఱ్ఱిచెట్టునొద్ద ప్రాణము దీసెనుః కాన నేస్థలమందుఁ జావవలెనని బ్రహ్మ లిఖించునో యచ్చటనె చచ్చునుగాని మఱియొక్కచోటఁ జావఁడు.

పురా. శూద్రకుఁడుః ఇతఁ డొకరాజు. ఇతఁడు కాశిలోఁ జచ్చుటకు నిశ్చయించుకొని కాశీవాసుఁ డయి కాళ్లున్నచో మఱియెక్కడికయినఁ బోవ నిచ్చ పొడము నేమో యని మోఁకాలిచిప్పల నూడఁదీసికొనియుండెను. అంత నాయూరియధిపతి యొక గుఱ్ఱమును గొనెను గాని దానిస్వారిచేయుట కెవ్వఁడు సమర్థుఁడు కాకుండెను. అది చూచి రాజాగుఱ్ఱము నధిరోహించినవానికిఁ గొప్పబహుమానము చేసెదనని చెప్ప నదివిని శూద్రకుఁ డశ్వపరీక్షయం దధికుఁడుగాన దన్నుఁ గొనిపోయి యాగుఱ్ఱముపయిఁ గూర్చుండఁబెట్టినచో నాగుఱ్ఱము నధిరోహించివత్తు నని చెప్ప వారట్లు చేసిరి. అంత నాగుఱ్ఱము వానిఁ గొనిపోయి యొకమఱ్ఱిచెట్టునఁ బెట్టికొట్టఁగా నచ్చటనే ప్రాణముల విడిచెను.

చ. ఘనబలవత్త్వ మచ్చుపడఁ | గల్గినవానికి హాని లేనిచోఁ
దనదగు సత్త్వమే చెఱుచుఁ | దన్ను న దెట్లన? నీరు లావుగాఁ
గను వసియించినన్ జెరువు | కట్టకు సత్త్వము చాలకున్నచో
గనుములు పెట్టి నట్టనడి | గండి తెగంబడకున్నె? భాస్కరా! 37

టీ. భాస్కరా! ఘనబలవత్త్వము = గొప్పబలిమ్ము, కల్గినవానికిన్ = కలమనుజునకు, హాని = అపాయము, లేనిచోన్ = ఇతరులవలన లేకపోయినను, తనది = స్వకీయమైనది, అగుసత్త్వమె = అయినట్టి

బలమే, తన్నుఁ, జెఱుచుఁ=పాడుచేయును, అదెట్లనఁ=అది యేలాగున ననఁగా, నీరు=ఉదకము, లావుగాఁగ=అధికముగా, వసించినఁ=ఉన్నప్పుడు, చెరువుకట్టకుఁ=చెర్వుగట్టునకు, సత్వము=బలము, చాలకున్నచోఁ=సరిపోనిచో, కనుమలు=సందులు, పెట్టి=పడి, నట్టనడిఁ=ఆ చెర్వుగట్టునడుమ, గండి=బిలము, తెగిబడక=తెగిపోక, ఉన్నె=ఉండునా? అనఁగా నుండదనుట.

తా. చెరువులో నీరధికముగా నున్నప్పుడు చెర్వుగట్టునకు సత్తువ లేనిచో నడుమ గండిపడిపోవును. అట్లె తనకధికమగుబలము కలిగినప్పుడు తనకు నితరులవలన సహాయము కలుగకపోయినను దనబలమె తన్నుఁ బాడుచేయును. వి శే. ఈపద్యము ద్వితీయచరణాంతమున "నీరు మిక్కిలింగనుక వసించినన్" అనివెక్కండ్ర పాఠమై యున్నది. కాని కళాపదముగు 'మిక్కిలి' యనుదాని ద్రుతాంతముగాఁ బ్రయోగించుట యనుచితము. మఱియు "కనుక" అనుదానికర్థమేమియు లేదు కావున 'నీరు లావుగాఁగను వసియించినఁ' అని పఠించుటయే యుచితము.

చ. ఘనుఁడగునట్టివాఁడు నిజకార్యసముద్ధరణార్థమై మహిం
బనివడి యల్పమానవుని బ్రార్థనచేయుట తప్పుగాదుగా?
యనఘుతెఁ గృష్ణజన్మమున నావసుదేవుఁడు మీదటెత్తుగాఁ
గనుగొని గాలిగానికడకాళ్లకు మ్రొక్కఁడెనాఁడు భాస్కరా.

టీ. భాస్కరా! ఘనుఁడు=గొప్పవాఁడు, అగునట్టివాఁడు=అయినమానవుఁడు, నిజకార్యసముద్ధరణార్థము అయి — నిజ=తన యొక్క, కార్య=పనిని, సముద్ధరణార్థము=నిర్వహించుకొనుటకై, మహిన్=భూమియందు, పనివడి=ప్రయత్నించి, అల్పమానవుని=నీచుని, ప్రార్థనచేయుట=ప్రార్థించుట, తప్పుకాదుకా=దోషముకా

దుకదా. ఎట్లనఁ ;కృష్ణజన్మమునఁ=కృష్ణావతారసమయమున, అనఘుతఁ=నిష్కలుషభావముచేత, ఆవసుదేవుఁడు=కృష్ణునితండ్రి యైనవసుదేవుఁడు, మీఁదుబెత్తుగాఁ=శిరోభూషణముగా, కనుఁగొని=తలంచికొని, నాఁడు=ద్వాపరయుగమునందు, గాలిగానిక డికాళ్లకుఁ=గాడిదయొక్క కొనకాళ్లకు, మ్రొక్కఁడే=నమస్కరింప లేదా? అనఁగా నమస్కరించెనని యర్థము.

**తా.** కృష్ణుఁ డవతరించినపిమ్మట నతనిఁ గంసునివలనఁ దప్పించుటకై వ్రేపల్లెకుఁ గొనిపోవనెంచి ద్వారపాలురకుఁ దెలియకుండఁ బోవుచుఁ దనకార్యము విఘ్నము కాకుండుటకయి గాడిదెకాళ్లకు నమస్కరించెను. అట్లె లోకములో మానవుఁడు తనకార్యము నెరవేర్చుకొనుటకు నొకనీచునిఁ బ్రార్థించినను నందువలన లోపము రాదు.

**పురా** వసుదేవుఁడు: ఇతఁడు కృష్ణునితండ్రి. కంసుఁ డనురాజునకు బావమఱఁది.కంసుఁడుతనసోదరి యగు దేవకీదేవి,నితనికిచ్చి పెండ్లిచేసెను. తనసోదరియందుఁ బుట్టినవాఁడు తన్నుఁ జంపుననిన యశరీరవాక్కు విని దేవకీవసుదేవులను బంధించి చెఱలో నుంచి వారిసంతానమును జంపుచుండెను. తరువాత నావసుదేవునకుఁ గృష్ణుఁ డవతరించెను. అంత వసుదేవుఁ డాపిల్లవానిని గంసుఁడు చంపునని యచ్చటికిసమీపమున నున్నవ్రేపల్లెకుఁ బోయి యచ్చట నాపిల్లను డించిరావలెనని ద్వారపాలురకుఁ దెలియకుండఁ బోవుచుండెను. అంతట నాసమీపమున నొకగాడిద మేయుచు నార్చుటకు యత్నించుచుండఁగా నదిచూచి వసుదేవుఁడు దాని యఱుపువలన నిద్రించినకావలివారు మేల్కని తనపనికి నంతరాయము కలిగింతురని దానియొద్దకుఁ బోయి నమస్కరించి దాని

నణవకుండఁజేసి తనకార్యమును సాధించెను. ఈకథ వాడుకలో నచ్చటచ్చట నున్నదికాని భాగవతమునందుఁ గనఁబడదు.

చ. ఘనుఁ డొకవేళఁ గీడ్పడినఁ గ్రమ్మఱ నాతనిలేమి వాపఁగాఁ
గనుఁగొన నొకసత్ప్రభువు గాక నరాధములోపతెందఱుం
బెనుచెఱు వెండినట్టితఱిఁ బెల్లున మేఘుఁడు గాక నీటితోఁ
దనుపఁదుషారముల్ శతశతంబులుచాలునటయ్యభాస్కరా.

టీ. భాస్కరా! ఒకవేళన్=ఒకసమయమందు, ఘనుఁడు=గొప్పవాఁడు, కీడ్పడినన్=కీడుపొందినచో- అనఁగా దరిద్రుఁడైనచో, క్రమ్మఱన్=తిరిగి, ఆతనిలేమి=ఆతనిబీదతనమును, వాపఁగాన్=పోఁగొట్టుటకు, ఒకసత్ప్రభువు గాక=మంచిరాజుగాక, నరాధములు=తుచ్ఛమానవులు, ఎందఱున్=ఎందఱయినను, ఓపరు=చాలరు. ఎట్లనన్: పెనుచెఱువు=పెద్దచెఱువు? ఎండినట్టితఱి=వట్టిపోయినసమయమందు, పెల్లునన్=వేగముగా, నీటితోన్=నీటిచేత, తనుపన్=నింపుటకు, మేఘుఁడుగాక = మబ్బయినచో సరిపడునుగాని, తుషారముల్ = మంచుబిందువులు, శతశతంబులు=నూఱునూఱులైనను, చాలునటయ్య=సరిపోవునా? అనఁగాఁ జాలవనుట.

తా. పెద్ద దొకచెరువు వట్టిపోయినప్పుడు దానిని త్వరలోనే నీటిచే నింపించుటకు మేఘుఁడు సమర్థుఁడు కాని మంచు బిందువు లెన్నియైనఁ జాలవు. అట్లె, గొప్పవానికి విధివశమున బీదతనము సంభవించినచో దానిని దొలఁగించుటకు నొకమహాప్రభువు సమర్థుఁడు కాని నీచమానవు లెందఱయినను సరిపోరు.

ఉ. చంద్రకళానతంసుకృప చాలనివాఁడు మహాత్ముఁడైనఁ దా
సాంద్రవిభూతిఁ బాసి యొకజాతివిహీనుని గొల్చియుంట తో

గీంద్రనుతాంఘ్రిపద్మ మతిహీనత నొందుటకాదుగా హరి
శ్చంద్రుఁడు వీరబాహునినిజంబుగఁగొల్వఁడె నాఁడు భాస్కరా.

టీ. భాస్కరా! యోగీంద్ర ... పద్మ—యోగీంద్ర=యోగీశ్వరుల చేత, నుత=కొనియాడఁబడు, అంఘ్రిపద్మ=పదపద్మములు గల వాఁడా, భాస్కరా! మహాత్ముఁడు ఐనన్=మనుష్యుఁడు గొప్ప వాఁడైనను, చంద్రకళావతంసుకృప—చంద్రకళ=చంద్రరేఖ, అవతంసు=శిరోభూషణముగాఁ గలయీశ్వరునియొక్క, కృప=దయ, చాలనినాఁడు=సరిపోని సమయమునందు, తాన్=ఆమానవుఁడు, సాంద్రవిభూతి=గొప్పసంపదను, పాసి=విడిచి, ఒకజాతివిహీనుని=ఒకనీచకులమువానిని, కొల్చియుంట=సేవించియుండుట, మతిహీనత=బుద్ధితక్కువ, కాదుగా=కాదుగదా, నాఁడు=కృతయుగము నందు, హరిశ్చంద్రుఁడు=సత్యహరిశ్చంద్ర చక్రవర్తి, వీరబాహు నిన్=వీరబాహుఁడనుమాలవానిని, నిజంబుగన్=నిశ్చయముగా, కొల్వఁడు+ఏ=సేవింపలేదా? అనఁగా సేవించెననియర్థము.

తా. హరిశ్చంద్రుఁడు చక్రవర్తియైనను దైవకృప లేకపోవుటచే జాతిహీనుఁ డగువీరబాహుని సేవించెను. కావున నీశ్వర దయ లేనప్పుడు తా నెంతగొప్పవాఁడైనను సంపదలఁ బాసి యొక నీచుని గొల్చియుండుట నిశ్చయము. అట్లు సేవించుట యొక బుద్ధిలోపము కాదు.

పురా. హరిశ్చంద్రుఁడు: ఇతఁడు సూర్యవంశపు రాజగుత్రి శంకుని కుమారుఁడు. ఇతఁ డాడినమాట తప్పనివాఁ డగుటచే వీని సత్యహరిశ్చంద్రుఁ డని పిలుతురు. ఇతనిరాజధాని అయో ధ్యాపురము. భార్య చంద్రమతి. కుమారుఁడు రోహితాశ్వుఁడు. అతఁడు విశ్వామిత్రునికి వాగ్దత్తము చేసినధనము నీయలేక పోవు

టచే నా ఋణము తీరునిమిత్తము కాశీపురంబున వీరబాహుం డనునొకమాలవాని కమ్ముఁబడి వాని సేవించెను. పిమ్మటఁ గొద్ది కాలములోనె తనరాజ్యమును బొందెను.

ఉ. చక్కఁ దలంపఁగా విధివశంబున నల్పునిచేత నైనఁ దాఁ
  జిక్కి యవస్థలం బొరలుఁ జెప్పఁగరాని మహాబలాఢ్యుఁడున్
  మిక్కిలిసత్వసంపదల మీఱినగంధగజంబు మావటీఁ
  డెక్కి యదల్చి కొట్టి కుదిఁయించిన నుండ దెయోర్చి భాస్కరా.

టీ. భాస్కరా! చక్కన్=బాగుగా, తలంపన్=ఆలోచింపఁగా, చెప్పన్+కన్=చెప్పుటకు, రాని మహాబలాఢ్యుఁడున్=వలను పడనంతగొప్పబలము కలవాఁడయినను, తాన్, విధివశంబునన్=దైవవశముచేత, అల్పునిచేతన్+ఐనన్=నీచునిచేతిలోనైనను, చిక్కి, అవస్థలన్=చెడుదశలను, పొరలున్=పొందుచుండును, ఎట్లనన్: మావటీఁడు=గజారోహకుఁడు, ఎక్కి=మీఁదఁ గూర్చుండి, అదల్చి=కేకవేసి, కొట్టి=అంకుశముతోఁ బొడిచి, కుదియించినన్=క్రుంగునట్లు చేసినను, మిక్కిలి=అధికమగు, సత్వసంపదలన్=బల సమృద్ధిచేత, మీఱినగంధగజంబు–మీఱిన=అతిశయించిన, గంధగజంబు=మదపుటేనుఁగు, ఓర్చి=సహించి, ఉండదె=ఉండలేదా? అనఁగా సహించియుండునని యర్థము.

తా. మిగులబలము గలమదపుటేనుఁగు మావటీఁడు తనపై నెక్కినను, నంకుశముతోఁ బొడిచినను కేకవేసినను క్రుంగఁదీసినను వానినన్నింటికి సహించుచున్నది. అట్లె యెంతబలము కల వాఁడయినను దైవవశమున నల్పునికి జిక్కి చెడుదశలం బొందు చుండును.

చ. చదు వది యెంత గల్గిన రసజ్ఞత యించుక చాలకున్నయా

చదువు నిరర్థకంబు గుణసంయుతు లెవ్వరు మెచ్చ రెచ్చటం
బదనుగ మంచికూర నలపాకము చేసిన నైన నందు నిం
పొదవెడునుప్పు లేక రుచి పుట్టఁగ నేర్చునటయ్య భాస్కరా.

టీ. భాస్కరా! చదువు, అది=విద్య, ఎంత. కల్గినన్=ఎంత యున్నప్పటికిని, రసజ్ఞత=సారము గ్రహించుట, ఇంచుక=కొంచె ము, చాలకున్నన్=లేనిచో, అచ్చదువు=ఆవిద్య, నిరర్థకంబు=వ్యర్థ ము., ఎచ్చటన్= ఏస్థలమందైనను, గుణసంయుతులు=మంచిగుణ ములతోఁ గూడుకొనినవారు, ఎవ్వరు=ఎవరయినను, మెచ్చరు= నుతింపరు, మంచికూరను, పదనుగన్=పక్వముగా, నలపాకమున్= నలచక్రవర్తి చేసినపాకమువంటిపాకమును (అనఁగాఁ పాకవిద్య యందు నలునితో నెవ్వరుసరిరారని లోకప్రసిద్ధము.) చేసినన్=చేసి నప్పటికిని, (అనఁగా లెస్సగా వండినప్పటికిని), అందున్=ఆకూర యందు, ఇంపు+ఒదవెడునుప్పు=మంచిసారస్యమును బుట్టించెడిల వణము, లేక=లేకుండ, రుచి=చవి, పుట్టన్+కన్+నేర్చున్+అట య్యా=కలుగునటయ్యా? అనఁగాఁ గలుగదని యర్థము.

తా. కూర నెంతబాగు గఁ బాకము చేసినప్పటికి నందులో నుప్పు కలియకపోయిన రుచి కలుగదు. ఎవ్వరు బాగున్నదని యనరు. అట్లె మనుష్యుఁ డెంత చదువుకొనినప్పటికిని రసగ్రాహకత్వము లేనిచో వానిచదువెల్ల నిష్ప్రయోజనము. మఱియు గుణవంతు లెవ్వరును మెచ్చుకొనరు.

ఈపద్యము నాల్గవపాదమున "ఇం పొదవెడునుప్పు లేక రుచి పుట్టఁగ నేర్చునటయ్య" అని పఠించినచో నఖలితవ్యుత్పత్తి యగుచు న్నది. అట్టియతి భారతాదిప్రామాణికగ్రంథములయందు లేదు గనుక వందులకు మారుగా "అందుతోఁ బొదవక యున్న నుప్పు

రుచిపుట్టఁగ" అని పఠించిన లెస్సగా నుండును.

ఉ. చాలఁబవిత్రవంశమున సంజనితుం డగునేని యెట్టిదు
శ్శీలుని నైనఁ దత్కులవిశేషముచే నొకపుణ్యుఁ డెంతయుం
దాలిమి నుద్ధరించును; సుధానిధిఁ బుట్టఁగఁగాదె శంభుఁ డా
హాలహలానలంబు గళమందు ధరించుట పూని భాస్కరా. 43

టీ. భాస్కరా! చాలఁబవిత్రవంశమునన్ = మిగులఁబరిశుద్ధమైనకులమునందు, సంజనితుండు=పుట్టినవాఁడు, అగునేని=అయినచో,తత్కులవిశేషముచేతన్ = వాఁడుజనించినకులమందలిగౌరవముచేత,ఎట్టిదుశ్శీలునినైనన్=ఎట్టిదురాచారము గలవానినైనను, ఒకపుణ్యుఁడు=ఒకపుణ్యాత్ముఁడు, ఎంతేయున్ = మిక్కిలి, తాలిమిన్=ఓర్పుచేత, ఉద్ధరించును=చేపట్టి పోషించును. ఎట్లనఁగా: శంభుఁడు=ఈశ్వరుఁడు, పూని=ప్రయత్నించి, ఆహాలహలానలంబు=ఆహాలాహలమనెడు నగ్నిహోత్రమును, గళమందున్ = కంఠమందు, ధరించుట=తాల్చుట, సుధానిధిన్=పాలసంద్రమందు, పుట్టఁగన్ కాదె=పుట్టుటచేత నే కదా.

తా. ఈశ్వరుఁడు హాలాహలాగ్ని మిగులభయంకరమైన దయినను పాలసంద్రమునఁబుట్టిన దనెడుహేతువుచేత దాని తనగళమందు నిలిపినాఁడు. అట్లె యెటువంటిదుశ్శీలుఁ డైనను మంచికులమునఁ బుట్టినచో నాకులమందలిగౌరవముచే వానిని దప్పక యెవఁడైన బుణ్యాత్ముఁడు గౌరవించి పోషించును.

పురా. హాలాహలము: ఇది యొకవిషపదార్థము. దేవదానవులమృతమున్నకాంక్షించి పాలసంద్రమును మథింపఁగా ముందుగా నిది జనించినది. ఇది మిగులభయంకరమై లోకములఁ గాల్చుచుండ దేవతలప్రార్థనవలన నీశ్వరుఁడు తనగళమందు నిలిపి లోకముల

బాధతోఁ లంగించెను.

ఉ. చేరి బలాధికుం డెఱిఁగి చెప్పినకార్యము చేయకుండినన్
పారము ముట్ట లేఁ డొక నెపంబునఁ దాఁ జెడు నెట్టిధన్యుఁడున్
బోరక పాండుపుత్త్రులకు భూస్థలి భాగము వెట్టు మన్న కం
సారిని గాకుచేసి చెడఁ డాయెనె కౌరవభర్త భాస్కరా. 44

టీ. భాస్కరా! బలాధికుఁడు=బలముచే గొప్పవాఁడు, చేరి=తనసమీపమునకు వచ్చి, ఎఱిఁగి=ముందు వచ్చుసంగతిని దెలిసికొని, చెప్పినకార్యము = చెప్పినపని, చేయకుండినన్ = చేయకున్నచో, ఎట్టిధన్యుఁడున్=ఎటువంటిసంపన్నుఁడును, పారము=తుదను, ముట్టలేఁడు=పొందలేఁడు, ఒకనెపంబునన్=ఒకనిమిత్తముచే, తాన్, చెడున్=చెడిపోవును,ఎట్లనన్: పోరక=యుద్ధము చేయకుండ, పాండుపుత్త్రులకున్=పాండవులకు, భూస్థలిని=భూమిని, భాగము వెట్టుము=పంచియిమ్ము, అన్నకంసారిని=అని చెప్పినకృష్ణుని, కాకు చేసి=తిరస్కరించి, కౌరవభర్త=దుర్యోధనుఁడు, చెడఁడాయెనె=చెడిపోయినాఁడు కాఁడా? అనఁగాఁ జెడెనని యర్థము.

తా. శ్రీకృష్ణుఁడు దుర్యోధనునియొద్దకుఁ బోయి పాండవులకు భూమిని పంచియిమ్మని బోధించి చెప్పఁగా నతనిఁ దిరస్కరించి యాతనిమాటలు వినక దుర్యోధనుఁడు చెడిపోయెను. అట్లె బలవంతుఁడు తనయొద్దకు వచ్చి చెప్పినకార్యము చేయకుండినచో నెంతటివాఁడును తనకార్యము నెరవేర్చుకొనలేఁడు మఱియుఁ ద్వరలోనే నశించును.

ఉ. చేసినదుష్టచేష్ట నది చెప్పక నేర్పునఁ గప్పిపుచ్చి తా
మూసినయంతటన్ బయలు ముట్టక యుండద దెట్లు? రాగిపై

బూసినబంగరుం జెదరి పోవఁగడంగిననాఁడునాఁటికిన్
దాసిన రాగి గానఁబడదా జనులెల్ల నెఱుంగ భాస్కరా. 45

టీ. భాస్కరా! మానవుఁడు, చేసినదుష్టచేష్ట=తాఁ జేసినపాపపుకార్యము, చెప్పక=ఎవరికిఁ దెలియఁజేయక, నేర్పునన్=ఉపాయముచే, కప్పిపుచ్చి=కనఁబడకుండఁజేసి, తాన్=తాను, మూసినయంతటన్=మూసిదాఁచినప్పటికిని, బయలుముట్టక= వెల్లడి కాకుండ, ఉండదు, అది+ఎట్లు=అది యేలాగనఁగా, రాగిపైన్=రాగి శలాకలపైని, పూసినబంగరున్=స్థాపన చేసినబంగారము, చెదరి పోవన్=చెదరిపోవుటకు, కడంగినన్=మొదలిడఁగా, నాఁడునాఁటికిన్=క్రమక్రమముగా, దాసినరాగి=లోపలనున్నరాగి, జనులు+ఎల్లన్=జనులందఱు, ఎఱుంగన్=ఎఱుంగునట్లు, కానఁబడదా=కనఁబడలేదా? అనఁగాఁ గనఁబడుచున్నదని యర్థము.

తా. రాగిపై పూసినబంగారుపూఁత చెదరిపోయినతోడనే లోపలనున్నరాగి యందఱికిఁ గనఁబడుచున్నట్లు దుష్టుఁడు తాఁ జేసినపాపపుఁబని నేర్పుచేత దాఁచిపెట్టినప్పటికి నది యందఱికిఁ దెలియకపోదు.

చ. తగిలి మదంబుచే నెదిరిఁ దన్ను నెఱుంగక దొడ్డవానితోఁ
బగఁగొని పోరుటెల్ల నతిపామరుఁడై చెడు టింతెకాక తా
నెగడి జయింపనేరఁ డది నిక్కము తప్పదు ధాత్రిలోపలన్
దెగి యొకకొండతోఁ దగరుఢీకొని తాఁకిన నేమి భాస్కరా.

టీ. భాస్కరా! తగిలి=వెంబడించి, మదంబుచేన్=కావరముచేత, ఎదిరిన్=శత్రువును, తన్నును=అనఁగా శత్రుబలమును దనబలమును, ఎఱుంగక=తెలిసికోక, దొడ్డవానితోన్=ఒకమహాత్మునితో, పగఁగొని=విరోధము పూని, పోరుటెల్లన్=పోట్లాడుటయం

తయు, అతిపామరుఁడువై=మిగులవివేకశూన్యుఁడయి, చెడుట=చెడి పోవుటయె, ఇంతెకాక=ఇంతకుఁదప్ప, తాన్=తాను, నెగడి=ప్రబలుఁడయి, జయింపనేరఁడు=గెలువఁజాలఁడు, నిక్కము=నిజము, తప్పదు=ఈమాటతప్పిపోదు. ధాత్రిలోపలన్=భూమియందు తగరు=గొఱ్ఱెపోతు-పొట్టేలు, తెగి=సాహసించి, ఒకకొండతోన్=ఒకపర్వతముతో, దాకొని=ఎదిరించి, తాఁకినన్=తాఁకినచో, ఏమి=ఏమిఫలము కలదు? అనఁగా నేమియు ఫలము లేదని యర్థము.

తా. పొట్టేలు సాహసించి యొకకొండ నెదుర్కొనితాకినచో దనతల పగులుటతప్ప నేమియులాభ ముండదు. అట్లె బలహీనుఁడు కావరముచేఁ దనబలమును శత్రువుబలమును బాగుగ యోజింపకుండ మహాబలునితోఁ బోట్లాడినచోఁ దాను చెడిపోవుటతప్ప యేమియు ఫల ముండదు.

చ. తడవఁగరాదు దుష్టగుణుఁ దత్వ మెఱుంగక యెవ్వరైన నా
చెడుగుణ మిట్లు వల్దని చెప్పిన గ్రక్కునఁ గోపచిత్తుఁడై
కడుఁ దెగఁ జూచుఁగా; మరుగఁ గాఁగిన తైలము నీటిబొట్టుపై
బడునెడ నాక్షణం బెగసి భగ్గున మండక యున్నె? భాస్కరా!

టీ. భాస్కరా! దుష్టగుణున్ = చెడుగుణములు కలవానిని, తత్వము=నిజము, ఎఱుంగక=తెలిసికొనకుండ, తడవఁగరాదు = వానిజోలికిఁ బోఁగూడదు, ఎవ్వరు + ఐనన్=ఏమనుష్యులైన, ఆ చెడుగుణము=వారు చేయునట్టిచెడ్డపని, ఇట్లు=ఈరీతి, వల్దు=వద్దు, అని, చెప్పినన్=బోధించినచో, గ్రక్కునన్ = వేగముగా, కోపచిత్తుఁడై = కోపముతోఁ గూడినమనస్సు కలవాఁడయి, కడున్=మిక్కిలి, తెగన్=సాహసపుఁబని చేయుటకు, చూచుఁగా=ఆలోచించు నుగదా! ఎట్లనన్: మరుగన్=మరుగునట్లుగా, కాఁ

గిన తైలము=కాచఁబడిననూనె, నీటిబొట్టు=నీటిచుక్క, పైఁ=తన యందు, పడునెడన్=పడునట్టిసమయమునందు, ఆక్షణంబె=అప్పుడె, ఎగసి=మీఁదికి లేచి, భగ్గునన్, మండక యున్నె = మండకుండునా? అనఁగా మండునని యర్థము.

తా. బాగుగాఁ గాఁగిన తైలము తనపైని నీటిచుక్కఁ బడినచో మీఁది కెగసి భగ్గున మండును. అట్లే దుష్టుఁడు తనకు హితము చెప్పువారలపై కోప మూని మండిపడును కనుక వాని జోలికిఁ బోఁగూడదు.

చ. తనకు ఫలంబు లేదని యెడం దలపోయఁడు కీర్తి గోరునా
ఘనగుణశాలి లోకహితకార్యము మిక్కిలిభార మైన మే
లనుకొని పూను శేషుఁడు సహస్రముఖంబుల గాలిఁ గ్రోలితా
ననిశము మోవఁడే మఱి మహాభర మైనధరిత్రి భాస్కరా. 48

టీ. భాస్కరా! కీర్తి=యశస్సును, కోరు=అపేక్షించు, నాఘన గుణశాలి=ఆ గొప్పగుణములచే నొప్పుచున్నవాఁడు, తనకున్, ఫలంబు=లాభము, లేదు+అని=కలుగ లేదని, ఎదన్ = మనస్సునందు, తలపోయఁడు=ఆలోచింపఁడు, లోకహితకార్యము=లోకములకు మేలయినకార్యము, మిక్కిలి=మిగుల, భారము+ఐనన్=కష్టమైనను, మేలు=మంచిది, అనుకొని=తలంచి, పూనున్=ఆ కార్యము చేయఁ బ్రయత్నించును, శేషుఁడు = అనంతుఁడు, సహస్రముఖంబులన్=వేమొగములచేతను, గాలిన్=వాయువును, గ్రోలి=భక్షించి, తాన్, మఱి, మహాభరము = మిక్కిలిబరువు గలది, ఐనధరిత్రిన్=అయినట్టిభూమిని, అనిశము=ఎల్లప్పుడు, మోవఁడే = మోయలేదా? అనఁగా మోఁచుచున్నాఁడని యర్థము.

తా. శేషుఁడు వాయుభక్షకుఁడై లోకోపకారమునిమిత్తము

మిక్కిలిబరువగుభూమండలము నెల్లప్పుడు మోఁచుచున్నాఁడు. అట్లె లోకములో యశమును గోరువాఁడు తనకు ఫలము లేక పోయినను లోకహితమగు కార్యము నెంతకష్టమైనదైనను నిర్వహించుచుండును. గాని తనలాభమునిమిత్తము చూడఁడు.

పురా. శేషుఁడు: ఇతఁడు నాగులలో నగ్రేసరుఁడు. ఇతఁడు కద్రువయందుఁ గవశ్యపునకుఁ గలిగినవాఁడు. ఇతఁడు మిగులమంచిగుణములు కలవాఁడు. ఇతనితల్లియు సోదరులును సవతితల్లి యగువినతను మోసపుచ్చఁ బూనుకొనఁగా నీతఁ డంగీకరింపక దుష్టులగుజననీసోదరులను విడిచి నారాయణునిగూర్చి ఘోరమగు తపస్సు చేసి యతనిదయకుఁ బ్రాతుఁడై యతనియనుమతిప్రకారము భూమిని వహింపఁబోయెను.

చ. తనకు నదృష్టరేఖ విశదంబుగఁ గల్గినఁగాని లేనిచో
జనునకు నెయ్యెడన్ బరులసంపదవల్ల ఫలంబు లేదుగా;
కనుఁగవ లెస్సగాఁ దెలివి గల్గినవారికిఁగాక గ్రుడ్డికిన్
కనుపడు నెట్లు వెన్నెలలు గాయఁగనందొకరూపు; భాస్కరా.

టీ. భాస్కరా! తనకున్=తనకు, అదృష్టరేఖ=భాగ్యరేఖ, విశదంబుగన్=స్పష్టముగ, కల్గినఁగాని=కలిగియుండినఁగాని=లేనిచో, ఆయదృష్టరేఖలేనప్పుడు, జనునకున్=మనుష్యునకు, ఎయ్యెడన్=ఏసమయమందును, పరులసంపదవల్లను=ఇతరులయైశ్వర్యమువలన, ఫలంబు=లాభము, లేదుగా=లేదుకదా. ఎట్లనన్: కనుఁగవన్ =రెండు కన్నులయందును, తెలివి=తేట, లెస్సగాన్=బాగుగా, (అనఁగాదృష్టిప్రసారము బాగుగాను) కల్గినవారికిఁగాక=కలిగినజనులకుఁదప్ప, గ్రుడ్డికిన్=అంధునకు, వెన్నెలలు, కాయఁగాన్=వ్యాపించియుండఁగా, అందున్=ఆవెన్నెలలందు, ఒకరూపు=ఒకరూపమైన, ఎట్లు

కనుపడుఁ=ఏలాగు కనుపడును? అనఁగాఁగనుపడదనియర్థము.

తా. వెన్నెల లంతట వ్యాపించియున్నప్పటికి నందులో నుం డెడున్వరూపములు చూపు బాగుగా నున్నవారికిఁ గనుపడును గాని గ్రుడ్డివానికిఁ గనఁబడదు. అట్లె పరులసంపద లంతటఁ బ్ర ఖ్యాతమై యున్నను వానివలన ఫలం బదృష్టము కలవారే కాని యదృష్టము లేనివారికిఁ గలుగదు.

ఉ. తాలిమితోడుతం దగవు దప్పక నేర్పరి యొప్పుతప్పులం
బాలన సేయుఁగా కట నుపాయవిహీనుఁడు సేయనేర్చునే?
పాలును నీరు నేరుపఱుపంగ మరాళ మెఱుంగుఁగాక మా
ర్జాల మెఱుంగనేత దురుచారురసజ్ఞతఁ బూన భాస్కరా. 50

టీ. భాస్కరా! నేర్పరి=నేర్పు గలవాఁడు, తాలిమితోడు తన్=ఓర్పుతో, తగవు=ధర్మమును, తప్పక=విడువక, ఒప్పుతప్పు లన్=దోషాదోషములను, పాలనసేయుఁగాక=కనిపట్టి చూచును గాని, అటన్=ఆకార్యమును, ఉపాయవిహీనుఁడు=ఉపాయము లేనివాఁడు, చేయన్=అతప్పులను ఒప్పులను సరిచేయుటకు, నే ర్చున్+ఏ=సమర్థుఁడా? అనఁగా కాఁడనుట. మరాళము=హంస, పాలును=క్షీరమును, నీరును=జలమును, ఏరుపఱుపంగన్=విడఁదీ యుటకు, ఎఱుంగుఁగాని=తెలిసికొనునుగాని, మార్జాలము=పిల్లి, తదురుచారురసజ్ఞతన్-తత్=ఆహంసయొక్క, ఉరు=గొప్పదియు, చారు=మనోహరమైనదియు నగు, రసజ్ఞతన్=రసికత్వమును, పూ నన్=పొందుట, ఎఱుంగునె=తెలిసికొనఁగలదా? అనఁగా నెఱుఁ గదని యర్థము.

తా. పాలను నీటిని విడఁదీయుటకు రాయంచ సమర్థమగు నుగాని పిల్లి సమర్థమైనది కాదు. అట్లే దోషాదోషములను నే

ర్పఱుచుటకు నేర్పు గలవాఁడు శక్తుఁడు కాని నేర్పు లేనివాఁడు శక్తి కలవాఁడు కాఁడు.

ఉ. తాలిమితోడఁ గూరిమిఁ గృతఘ్నున కెయ్యెడ నుత్తమోత్తముల్
మేలొనరించినన్ గుణము మిక్కిలి కీడగుఁ బాముపిల్లకున్
పాలిడి పెంచిన న్విషము పాయఁగనేర్చునె దానికోరలం
జాలఁగ నంతకంత కొకచాయను హెచ్చును గాక భాస్కరా!

టీ. భాస్కరా! ఉత్తమ+ఉత్తముల్ = మిగులమంచివారు, తాలిమితోడన్=శాంతముతో. కూరిమిన్=ప్రేమచేతను, కృతఘ్నునకున్=చేసినమేలు మఱచినవానికి, ఎయ్యెడన్=ఏసమయమందును, మేలు=ఉపకారము, ఒనరించినన్=చేసినచో, గుణము=తాఁ జేసినయుపకారమువలనఁ గలిగెడిఫలము, మిక్కిలి, కీడు+అగున్=అపాయము కలిగించును. ఎట్లనన్: పాముపిల్లకున్, పాలు ఇడి=పాలుపోసి, పెంచినన్=వర్ధించినచో, దానికోరలన్=ఆపాము పిల్లయొక్క కోరలయందు, విషము=గరళము, చాలఁగన్=అధికముగా, అంతకంతకున్=క్రమక్రమముగా, ఒకచాయ=ఒక కాంతి, హెచ్చును గాక=ఎక్కువగుచుండునుగాని, పాయఁగన్ నేర్చునె=ఆవిషమునువిడిచిపెట్టునా? అనఁగా విడువదని యర్థము.

తా. పాముపిల్లకుఁ బాలు పోసి పెంచినను దానికోరలయందు విషము క్రమక్రమముగా నధికమగుచుండునుగాని తఱిగిపోదు. అట్లె మంచివారు చేసినమేలు మఱచెడివానికి మేలు చేసినట్టయిన నందువలనఁ గలుగుఫలము మిగులవిపరీతముగా నుండును.

చ. తెలియనికార్యమెల్లఁ గడతేర్చుట కొక్కవివేకిఁ జేకొనన్
వలయు నటైనఁ దిద్దుకొనవచ్చుఁ బ్రయోజనమాంద్య మేమియుం
గలుగదు; ఫాలమందుఁ దిలకం బిడునప్పుడు సేత నద్దమున్

గలిగినఁ జక్కఁ జేసికొనుఁ గాదె నరుండది చూచి భాస్కరా.

టీ. భాస్కరా! తెలియనికార్యము+ఎల్లన్=తనకుఁ దెలియనట్టిపని నెల్లను,కడ తేర్చుటకున్=నెఱవేర్చుటకు, ఒక్కవివేకిన్=ఒక తెలివిగలమానవుని, చేకొనన్ వలయును=చేరఁదీసికోవలెను. అటు+ ఐనన్=అట్లయినచో, దిద్దుకొనన్ వచ్చున్=తనలోపములఁ దొలఁగించి కార్యము నెఱవేర్చుకోవచ్చును. ప్రయోజనమాంద్యము=కార్యమునకు ఆలస్యము, ఏమియున్=కొంచెమైనను, కలుగదు=సంభవింపదు, ఎట్లనన్:–నరుండు=మానవుఁడు, ఫాలమందున్=నుదుటియందు, తిలకంబును=బొట్టును, ఇడునప్పుడు=పెట్టుకొనునప్పుడు, చేతన్=చేతియందు, అద్దమున్, కలిగినన్=కలిగియున్నచో, అది=ఆయద్దమును, చూచి=వీక్షించి, చక్కన్ చేసికొనుఁగాదె=బాగుగా దిద్దుకొనును గదా.

తా. మానవుఁడు నుదుటియందు బొట్టుంచుకొనునప్పుడు చేతిలో నద్దమున్నచో దానిం జూచికొని యాబొట్టును బాగుగా దిద్దుకొనును; అట్లే తనకుఁ దెలియని కార్యమును దుదముట్టించుటకొక నేర్పరిని జేరఁదీసికొనినచో వానినిబట్టి కార్యమాంద్యము లేకుండ నాపనిని నిర్వహించుకొనును.

ఉ. దక్షుఁడు లేనియింటికిఁ బదార్థము వేఱొకచోటనుండి వే
లక్షలు వచ్చుచుండినఁ బలాయన మైచనుఁ గల్ల కాదు, ప్ర
త్యక్షము వాఁగులున్ వఱదలన్నియు వచ్చిన నీరు నిల్చునే
యక్షయమైన గండి తెగినట్టి తటాకములోన భాస్కరా.

టీ. భాస్కరా! దక్షుఁడు=సంసారభారము వహించుటకు సమర్థుఁడు, లేనియింటికిన్=లేనట్టిగృహమునకు, పదార్థము=ద్రవ్యము, వేఱు+ఒకచోటనుండి=మఱియొక స్థలమునందుండి, వేలక్షలు=వే

యులక్షులరూకలు, వచ్చుచుండినన్=వచ్చుచున్నప్పటికిని, పలాయనము+అయి=చెదరిచెదరలై, పోవును, (అనఁగా నెప్పుడువచ్చిన ధనమప్పుడేపోవును.) కల్లకాదు=అబద్ధముకాదు, ప్రత్యక్షము=స్పష్టము. ఎట్లనన్:-వాఁగులు=కొండకాలువలు,వఱదలు+అన్నియు=నీటివెల్లువలన్నియు, వచ్చినన్=వచ్చుచున్నను, అక్షయము=గొప్పది, ఐనగండి=అయినరంధ్రము, తెగినట్టితటాకములోనన్=పడినట్టి చెఱువులోపల, నీరు=జలము, నిల్చునే=ఉండునా? అనఁగా నుండదని యర్థము.

తా. పెద్దసందు పడినచెఱువులోనికి నెన్నినదీప్రవాహములు వచ్చినను నీరు కొంచెమైనను నిలువదు. అట్లే సంసారభారము వహించెడు నధిపతి లేనియింటికి మఱియొకచోటనుండి యెంత ద్రవ్యము వచ్చుచుండినను నప్పుడే చెల్లిపోవునుగాని యొక్కకాసయినను నిలువదు.

ఉ. దానపరోపకారగుణధన్యత చిత్తములోన నెప్పుడున్
లేనివివేకశూన్యునకు లేములు వచ్చినవేళ, సంపదల్
పూనినవేళ, నొక్కసరిపోలును; జీకున కర్ధరాత్రియం
దైన నదేమి పట్టపగలైన నదేమియు లేదు భాస్కరా.

టీ. భాస్కరా! దాన ... ధన్యత-దాన=ఈవి, పరోపకార=పరులకుపకారము చేయుట,గుణ=మొదలగుసుగుణములచే,ధన్యత=కృతార్థత్వము,ఎప్పుడున్=ఏసమయమందైనను, చిత్తములోన్=మనస్సులో, లేనివివేకశూన్యునకున్=లేనట్టియవివేకికి, లేములు=బీదతనములు, వచ్చినవేళన్=వచ్చినప్పుడును, సంపదల్=ఐశ్వర్యములు, పూనినవేళన్=కలిగినప్పుడును, ఒక్కసరిపోలును = ఒక్కరీతిగానే యుండును. చీఁకునకున్=గ్రుడ్డివానికి,అర్ధరాత్రి=నడురేయి, ఐనన్

అది ఏమి=అయినప్పుడు గలలాభ మేమి? పట్టపగలు=మధ్యాహ్నము, ఐనన్ అదియేమి=అయినప్పుడు గలుగులాభ మేమి-ఏమియు లాభము లేదు.

తా. గ్రుడ్డివానికి నడిరేయి యయినను బట్టపగలైనను భేదము సుంతేనియుఁ దెలియదు. అట్లే దానాదిగుణములు మనస్సులోలేని తెలివితక్కువవానికి బీదతనము వచ్చినను సంపదలు వచ్చినను నొక్కవిధముగానే యుండును.

ఉ. దానము సేయఁ గోరినవదాన్యున కీయఁగ శక్తిలేనిచో
నైనఁ బరోపకారమునకై యొకదిక్కునఁ దెచ్చియైన నీఁ
బూనును; మేఘుఁడంబుధికిఁబోయిజలంబులఁదెచ్చియీయఁడే
వాన సమస్తజీవులకు వాంఛిత మింపెసలార; భాస్కరా.

టీ. భాస్కరా! దానము=ధర్మమును, చేయన్=చేయుటకు, కోరినవదాన్యునకున్=ఇష్టమున్నదాతకు, ఈయన్+కన్=ఇచ్చుటకు, శక్తి=సామర్థ్యము, లేనిచోన్+ఐనన్=లేకపోయినప్పటికిని, పరోపకారమునకున్=ఇతరుల కుపకారము చేయుటకు, ఒకదిక్కునన్=మఱియొకచోట, తెచ్చి+ఐనన్=అప్పు గొనివచ్చియైన, ఈన్=ఇచ్చుటకు, పూనును=ప్రయత్నించును. ఎట్లన:- మేఘుఁడు=మబ్బు, అంబుధికిన్=సముద్రముదరికి, పోయి=వెళ్లి, జలంబులన్=నీటిని, తెచ్చి=కొనివచ్చి, సమస్తజీవులకున్=ఎల్లజంతువులకు, వాంఛితము=ఇష్టము, ఇంపెసలు+ఆరన్=నిండునట్లుగా, వానన్=వర్షమును, ఈయఁడే=కురియఁడా? అనఁగాఁ గురియుచున్నాఁడని యర్థము.

తా. మేఘుఁడు తనయొద్ద నుదకము లేనప్పుడు సముద్రునియొద్దకుఁ బోయి యప్పు దెచ్చి యెల్లజీవులు నానందము నొందునట్లు

వర్షించుచున్నాఁడు. అట్లే దానముచేయ నిచ్ఛ గలిగినదాతయుఁ దనయొద్ద ధనము లేనప్పుడు మఱియొకచోట ఋణము గొనివచ్చి యయిన నిచ్చుచుండును.

ఉ. దానము చేయనేరనియధార్మికుసంపద యుండియుండియుఁ
దానె పలాయనంబగుట తథ్యము; బూరుగు మాను గాచినన్
దానిఫలంబు లూరక వృథా పడిపోవవె నెండి గాలిచేఁ
గానలలోన నేమిటికిఁ గాక యభోజ్యములౌట భాస్కరా.

టీ. భాస్కరా! దానము = ఈవి, చేయనేరనియధార్మికుసంపద=చేయుట కిష్టపడనిధర్మశూన్యునియొక్క యైశ్వర్యము, ఉండి యుండియుఁ=ఉండియున్నప్పటికిని, తానె=తనంతఁదానె, పలాయనంబు+ అగుట=పర్వెడిపోవుట, తథ్యము=నిశ్చయము,ఎట్లన:-బూరుగుమాను=బూరుగుచెట్టు,కాచినన్=ఫలించినప్పటికిని, దానిఫలంబులు=ఆబూరుగుచెట్లపండ్లు, అభోజ్యములు=తినఁదగనివి, అగుటన్=అయియుండుటచే, ఊరక=మిన్నక, వృథా=వ్యర్థముగా, ఎండి=ఎండచే నెండిపోయి, గాలిచేన్=వాయువువలన, కానలలోనన్=అడవులలో, ఏమిటికిఁగాక=ఎందుకుఁ బనికిరాకుండ, పడిపోవవు+ఎ=పడిపోవుచుండ లేదా-అనఁగాఁ బడుచున్నవని యర్థము.

తా. బూరుగుచెట్టు ఫలించినప్పటికిని దానిఫలములు ఎవ్వరికిఁ దినుట కుపయోగింపక యెండి గాలిచేఁ దూలఁగొట్టఁబడి యడవులలో వ్యర్థముగాఁ బడిపోవుచున్నవి. అట్లె ధర్మబుద్ధి లేనివానికి సంపదలున్నప్పటికి నవి యున్నట్టులేయుండి యొరులకెవ్వరికి నుపయోగింపక పలాయనమగుచుండును.

చ. నడవక చిక్కి లేమి యగునాఁడు నిజోదరపోషణార్థమై
యడిగిభుజించుటల్ నరులకారయవ్యంగ్యము కాదు; పాండవుల్

గడుబలశాలు రేవురు నఖండవిభూతి దొలంగి భిక్షముల్
గుడువరె యేకచక్రపురిఁ గుంతియుఁ దారొకచోటభాస్కరా

టీ. భాస్కరా! నడవక=జరుగుపాటులేక, లేమియగునాఁడు=పేదఱికము వచ్చునప్పుడు, నిజోదరపోషణార్థమె=తనపొట్టనింపుకొనుటకయి, అడిగి=యాచించి, భుజించుటల్=తినుటలు, ఆరయన్=ఆలోచింప, నరులకున్=మానవులకు, వ్యంగ్యము=నిందింపఁదగ్గినది, కాదు. కడున్=మిక్కిలి, బలశాలురు=బలముచే నొప్పువారలును, ఏవురు=అయిదుగు రగు,పాండవుల్=ధర్మరాజాదులు, అఖండవిభూతి=సంపూర్ణమగునైశ్వర్యము, తొలంగి=విడిచి, ఏకచక్రపురిన్=ఏకచక్రమనుపురమునందు, తారును=ఆపాండవులును, కుంతియున్=వారలతల్లి యగుకుంతీదేవియు, ఒకచోటన్=ఒకస్థలమునందు, భిక్షముల్=యాచించికొని తెచ్చెడియన్నములు, కుడువరె=తినరా? అనఁగా భుజించిరని యర్థము.

తా. బలవంతు లగుపాండవులయిదుగురు సంపూర్ణ మగుసంపదల విడిచిపెట్టి తల్లితోఁగూడ నేకచక్రపురంబున బిచ్చమెత్తుకొనుచు జీవించిరి. కావున లోకములో మానవుఁడు బీదతన మనుభవించునప్పుడు తనపొట్ట నింపుకొనుటకుఁ బరుల యాచించికొనిన నది నింద్యనుగుపని కాదు.

పురా. ధృతరాష్ట్రుని సెలవుచొప్పునఁ బాండవులును ఢిల్లియుఁ గాశీపురంబునఁ గ్రొత్తగ నిర్మింపఁబడినలక్కయింటిలో నివసించియుండిరి. దుర్యోధనుండు రాజ్యము నపేక్షించుచుఁ బాండవులఁ జంపించినఁగాని తనకోర్కె నెఱవేఱదని యూహించి పాండవులు నిద్రించుసమయమున నాగృహమును గాల్చిరావలయునని చెప్పి కొందఱిని రహస్యముగానంపెను. వారును వల్లెయని పోయి పాండ

వులను సేవించుచు నచటనుండియెడరు వేచియుండిరి. దుర్యోధనుఁడు చేసినయామాయను భీముఁడు విదురునివలనఁ దెలిసికొని యొక నాఁటిరాత్రియందఱునిద్రించుచుండఁ దనసోదరులను దల్లిని బైకిఁ గొనిపోయి యాగృహంబునుదానె కాల్చితనవారలతోఁగూడ నొకయడవిఁ బ్రవేశించెను. అంత తనవారలుమేల్కని వానివలననావృత్తాంతమువిని భీమునిసాహసకృత్యమును మిగుల నుతించిరి. పిమ్మట వారచ్చటికిఁగొంతదూరములో నున్న యేకచక్రమనుపురమునకుఁ బోయి బ్రాహ్మణులవలె నటించుచు, బిచ్చమెత్తుకొని భుజించుచు జీవించిరి.

చ. నుడువుల నేర్పు చాలనిమనుష్యుఁ డెఱుంగక తప్పనాడినం
గడుఁ గృపతోఁ జెలంగుదురు కాని యదల్పరు తజ్ఞులెల్లఁ;ద
ప్పడుగులు వెట్టుచున్నడచునప్పుడు బాలునిముద్దు సేయఁగాఁ
దొడగుదురింతె కానిపడఁ ద్రోయుదురే యెవరైన భాస్కరా.

టీ. భాస్కరా! నుడువులన్ = మాటలయందు, నేర్పు = చాతుర్యము, చాలనిమనుష్యుఁడు = లేనిమానవుఁడు, ఎఱుఁగక = తెలియక, తప్పన్ + ఆడినన్ = తప్పుపలికినచో, తజ్ఞులెల్లన్ = పండితులందఱు, కడున్ = మిక్కిలి, కృపతోన్ = దయతో, చెలంగుదురు = సంతసింతురు కాని, అదల్పరు = కోపముతోఁగసరరు. ఎట్లనన్, తప్పడుగులు = తప్పటడుగులు, పెట్టుచున్ = వేయుచు, నడుచునప్పుడు = నడచెడి సమయమున, బాలునిన్ = పిల్లవానిని, ముద్దుచేయన్ కాన్ = ప్రేమించుటకు, తొడఁగుదురు = ప్రారంభింతురు, ఇంతె కాని, ఎవరైనన్ = ఎట్టిదుష్టమనుష్యులైనను, పడన్ = క్రిందపడునట్లుగా, త్రోయుదురే = త్రోయుదురా? అనఁగా త్రోయరనియర్థము.

తా. ఎట్టిమానవులైనను బాలుఁడు తప్పటడుగులు పెట్టి నడ

చునప్పుడు వానిని ప్రేమింతురు కాని క్రిందికిఁబడఁద్రోయరు. ఆ ట్లె పండితులు మాటలయందు నేర్పు చాలనివా రెఱుఁగక త ప్పుపలికిన నది విని సంతసింతురు కాని కోపముతోఁ గసరరు.

ఉ. నేరిచి బుద్ధిమంతుఁ డతినీతివివేకము దెల్పినం జెడం
గారణ మున్నవానికది గైకొనఁగూడదు నిక్కమే దురా
చారుఁడు రావణాసురుఁ డసహ్యముఁ బొందఁడె చేటుకాలముం
జేరువయైననాఁడు నిరసించి విభీషణుబుద్ధి భాస్కరా.

టీ. భాస్కరా! బుద్ధిమంతుఁడు=తెలివికలవాఁడు, నేరిచి=అభ్య సించి-తెలిసికొని, అతినీతివివేకము= అతిశయమైన రాజనీతియొక్క మహిమ, తెల్పినన్=బోధింపఁగా, చెడన్=చెడిపోవుటకు, కార ణమున్నవానికిన్=హేతువున్నవానికి, అది=ఆనీతి, గైకొనన్ = గ్రహించుటకు, కూడదు=ఇష్టముండదు, నిక్కమే=నిశ్చయమె, దు రాచారుఁడు=చెడునడతగలవాఁడు, రావణాసురుఁడు, చేటుకాలము =పోఁగాలము, చేరువయైననాఁడు=సమీపించినపుడు, విభీషణుబుద్ధి= తమ్ముఁడగు విభీషణుఁడు చెప్పిననీతిని, నిరసించి=తిరస్కరించి, అస హ్యము పొందఁడే=అసహ్యము పొందలేదా? అనఁగాఁ బొందె ననుట.

తా. దురాత్ముఁ డగురావణుఁడు తనకుఁ బోఁగాలము సమీ పించుటచేతఁ దమ్ముఁ డగువిభీషణుఁడు చెప్పిననీతిఁ దిరస్కరించెను. అట్లె లోకములో మానవుఁడు తనకుఁ జేటుకాలము సమీపించు నప్పుడు బుద్ధిమంతుఁడు చెప్పినహితవచనముల విన నిష్ట పడఁడు.

చ. నొగిలినవేళ నెంతటి ఘనుండును దన్నొక రొక్కనేర్పుతో
నగపడి ప్రోదిసేయక తనంతట బల్మికి రాఁడు నిక్కమే

జగమున నగ్ని యైనఁగడు సన్నగిలంబడియున్న నింధనం
బెగయఁగఁ ద్రోచియూఁదక మఱెట్లురవుల్కొననేర్చు భాస్కరా.

టీ. భాస్కరా! నొగిలినవేళన్=బీదతనము కలిగియున్న సమయమున, ఎంతటిఘనుండును=ఎంతగొప్పవాఁడైనను,తన్నున్,ఒకరు=మఱియొకరు,ఒక్క నేర్పుతో=ఒక యుపాయముతో,అగపడి=కనఁబడి,ప్రోదిచేయక=పోషింపకుండ,తనంతటన్=తనకుఁదాను,బలిమిన్ రాఁడు=బలము చెందలేఁడు,నిక్కమే= నిజమె,ఎట్లనన్:జగమునన్=భూమియందు, అగ్ని యైనన్=అగ్నిహోత్రుఁడంతటి తేజశ్శాలియైనను, కడున్=మిక్కిలి, సన్నగిలంబడియున్నన్=కృశించియున్న సమయమున, ఇంధనంబున్=పొయిలోనున్న కట్టెను, ఎగయఁగన్ ద్రోచి=ఉపాయముతోఁ బొయిలోనికిఁద్రోచి,ఊఁదక=ఊఁదకుండ, మఱి ఎట్లు=మఱియేలాగున, రవుల్కొనన్ నేర్చున్ = మండుటకుఁ బూనుకొనును.

తా. అగ్నిహోత్రుఁ డంత తేజశ్శాలి యైనను దాను కృశించియున్నప్పుడు ప్రొయిలోని కట్టెలు బాగుగా నెగ ద్రోసి యుపాయముతో నూఁదినఁగాని తిరిగి రవులుకొని మండఁడు. అట్లె యొక ఘనునకు బీదతనము సంభవించినప్పుడు మఱియొకఁడు వానిని ప్రేమతోఁ జేరఁదీసి పోషించినఁగాని తిరిగి బలమును బొందలేఁడు.

ఉ. పండితులైనవారు దిగువన్ దగనుండఁగ నల్పుఁడొక్కఁడు
ద్దండతఁ బీఠమెక్కిన బుధప్రకరంబుల కేమియెగ్గగున్?
కొండొకకోఁతి చెట్టుకొనకొమ్మలనుండఁగఁ గ్రింద గండభే
రుండమదేభసింహనికురుంబములుండవె? చేరి భాస్కరా.

టీ. భాస్కరా! పండితులు=విద్వాంసులు,ఐనవారు =అయినట్టిజనులు,దిగువన్=క్రింద,ఉండఁగన్ =వసించియుండఁగా, అల్పుఁడు=నీ

చుఁడు, ఒక్కఁడు, ఉద్దండతన్=దుష్టత్వముచే, పీఠము+ఎక్కినన్=పీఠముపైఁగూర్చుండినచో, బుధప్రకరంబులకున్=పండితసమూహమునకు, ఏమిఎగ్గు అగున్=ఏమికీడుకలిగెడిని? అనఁగా నేమియుఁ గలుగదనియర్థము. కొండొకకోఁతి=ఒకవానరము, చెట్టుకొనకొమ్మలన్=వృక్షముయొక్కకొనకొమ్మలయందు, ఉండఁగన్ = వసించియుండఁగా, క్రిందన్=ఆచెట్టుక్రింద, గండ ... నికురుంబములు–గండభేరుండ=గండభేరుండమనెడిపక్షులయొక్కయు, మదేభ=ఏనుఁగులయొక్కయు, సింహ=సింహములయొక్కయు, నికురుంబములు=సమూహములు, చేరి=కూడి, ఉండవె=ఉన్నవి కావా?

తా. చెట్టుక్రింద గండభేరుండము మొదలగుమృగము లుండఁగ నా చెట్టుకడకొమ్మలయందు నొకకోఁతి యున్నప్పటికి నామృగములకేమియు లోపము లేదు. అట్లె పండితులుక్రిందనుండు సమయమున నీచుఁడొకఁడుపీఁటమీఁద గూర్చున్నప్పటికి నంతమాత్రమున నాపండితులకేమియుఁ గొఱంత లేదు.

ఉ. పట్టుగ నిక్కుచున్ మదముఁ బట్టి మహాత్ములఁ దూలనాడినం
బట్టిన కార్యముల్ చెడును ప్రాణము పోవు? నిరర్థదోషముల్
పుట్టు; మహేశుఁగాదని కుబుద్ధి నొనర్చిన యజ్ఞతంత్రముల్
ముట్టక పోయి దక్షునికి మోసమువచ్చెఁగదయ్య భాస్కరా.

టీ. భాస్కరా! మదముఁబట్టి=గర్వముచేత, పట్టుగన్=పట్టుదలగా, నిక్కుచున్=నిగుడుచు, మహాత్ములన్=గొప్పవారిని, తూలనాడినన్=నొవ్వఁబలికినచో, పట్టినకార్యముల్=తానారంభించినపనులు, చెడును=నశించును, ప్రాణముల్=జీవములు, పోవును, నిరర్థదోషముల్= నిమిత్తము లేనిపాపములు, పుట్టున్=సంభవించును, ఎట్లనన్:–మహేశున్=ఈశ్వరుని, కాదని=ధిక్కరించి, కుబు

ద్ధిఁ=కుత్సితబుద్ధిచేత, ఒనర్చినయజ్ఞతంత్రముల్ = చేసిన యాగమనెడికార్యము, ముట్టక=నెఱవేఱక, పోయి=చేరి, దక్షునికిఁ=దక్షప్రజాపతికి, మోసము=చేటు, వచ్చెఁ కదయ్య=సంభవించెనుగదా?

తా. శివునియందలికోపముచే నతనిఁ బిలువకుండ దక్షప్రజాపతి యజ్ఞమాచరించెను గాని యది నెఱవేఱలేదు; సరియొకదా యతనిప్రాణములుకూడఁ బోయెను. కావున దుష్టుఁడు మదముచేఁ గ్రిందుమీఁదుగానక నిక్కుచు మహాత్ముల ధిక్కరించి తానొక కార్యము చేయఁబూనినచో నాకార్యము చెడును; జీవములు పోవును. గొప్పదోషములుగూడ సంప్రాప్తమగును.

పురా. పూర్వము దక్షుఁడొక నాఁడు బ్రహ్మసభకుఁ బోయెను. వచ్చుచున్నదక్షునిఁజూచి యాసభనున్నవారందఱు లేచి గౌరవించిరి. కాని యీశ్వరుఁడు సమాధిలోనుండుటచేత లేవలేదు. అందులకు దక్షుఁడీశ్వరుని నిందించుచుఁ దా నాచరింపఁబోవుయజ్ఞమునకు దేవతలనందఱిని బిలిచి యీశ్వరుని బిలువలేదు. అందువలన శివుఁడు దక్షుఁడు తనయందుఁ గనఁబఱిచినయవమానమును సహింపలేక వీరభద్రాదుల సృజించి పంపెను. వా రతికోపముతో దక్షుని యజ్ఞవాటము సొచ్చి యజ్ఞము ధ్వంసముచేసి యాతనిఁ జంపిరి.

చ. పరహితమైనకార్య మతిభారముతోఁ డిదియైనఁ బూనుస
త్పురుషుఁడులోకముల్ పొగడఁ బూర్వమునం దొకబాలవర్షముఁ
గురియఁగఁజొచ్చినన్ గదిసి గోబ్బనగోజనరక్షణార్థమై
గిరినొకకేల నెత్తెనఁట కృష్ణుఁడు ఛత్రముభాతి భాస్కరా.

టీ. భాస్కరా=ఓసూర్యుఁడా! పరహితము=పరులకు మేలుచేసెడిది, అయినకార్యము=అయినట్టిపని, అతిభారముతోఁ డిదియైనన్=

మిగులఁగష్టముతోఁ గూడినదయినను, లోకముల్ = జగమందలిజనులు, పొగడన్ = నుతించునట్లుగా, పూను = ఆకార్యము చేయయత్నించును. ఎట్లన:- పూర్వమునందున్ = తొల్లింటికాలమున (అనఁగా ద్వాపరయుగమునందు) ఇంద్రుఁడు (అనుక్తకర్తృపదమధ్యాహారము) ఒకఱాలవర్షమున్ = ఒకఱాలవానను, కురియఁగఁజొచ్చినన్ = కురియించుచుండఁగా, కృష్ణుఁడు = శ్రీకృష్ణమూర్తి, గొబ్బునన్ = వేగముగా, కదిసి = దగ్గఱగాఁబోయి, గోజనరక్షణార్థమై = గోవులను గోపాలకులను రక్షించునిమిత్తము, గిరిన్ = పర్వతమును, ఛత్రము భాతిన్ = గొడుగువలె, ఒకకేలన్ = ఒకచేతితో ఎత్తెనఁట = పయికిఁబట్టుకొనెనఁట.

తా. దేవేంద్రుఁడు కృష్ణునిపై కోపముచేతనతని, నతనిగోవులను గోపాలురను బాధించుటకయి ఱాలవానఁ గురియించుచుండఁగాఁదన్నును, వారలనురక్షించునిమిత్తము మిగులఁగష్టమగు కార్యమైనను నొకకొండను గొడుగుగాఁ బట్టికొనినట్లు మహాత్ముఁడెంతకష్టమగుకార్యమైనను పరహితముకొఱకు జనులునుతించునట్లు చేయుచుండును..

పురాణాంశము:- పూర్వముగొల్లలందఱు నింద్రయాగంబు చేయుచుండెడివారు. ఆయాగమును కృష్ణుండుమాన్పించినందున నింద్రుండుగోపించి శిలావర్షమును గురియించికృష్ణుని, గోవులను, గోపాలకులను బాధించుచుండఁగాఁ గృష్ణుఁ డెంతమాత్రము జంకక పర్వతమును గొడుగుగఁబట్టికొని యాముప్పును దప్పించెను. అంత నింద్రుండు కృష్ణునిశక్తిని జూచి యాశ్చర్యపడి యతనినుతించి యతనిదయకుఁ బాత్రుఁడాయెను.

వ్యాకరణాంశము. కురియఁగఁజొచ్చినన్ = ఇటఁగురియుధాతువు.

కురియించుననునర్థంబునఁ బ్రయోగింపఁబడినది. ఇందులకు బ్రయోగము-హరివంశము. పూ. 4. ఆ. గీ, అసురకామినీనేత్రతోయములు గురిసి, యంబుదద్యుతిఁ బ్రదదళసస్యంబుఁ బ్రోచునెవ్వఁడవిష్ణుఁడు.

ఉ. పలుచనిహీనమానవుఁడు ♦ పాటిఁ దలంపక నిష్ఠురోక్తులం
బలుకుచునుండుఁగాని మతి♦భాసురుఁడై నగుణప్రపూర్ణుఁ డ
ప్పలుకులఁ బల్కఁబోవఁడు;ని♦బద్ధిగ, నెట్లన వెల్తికుండఁదాఁ
దొలఁకుచునుండుఁ గానిమఱి♦దొల్కునెనిండుఘటంబు భాస్కరా

టీ. భాస్కరా ! పలుచనినీచమానవుండు=మిగులఁజులుకనిమనుష్యుఁడు, పాటి=న్యాయమును, తలంపక=విచారింపక, నిష్ఠుర+ఉక్తులన్=కఠినవాక్యములను, బలుకుచునుండుఁగాని=అనుచుండును గాని, మతిభాసురుఁడు=బుద్ధిచేఁ బ్రకాశించునట్టివాఁడు, అయినగుణప్రపూర్ణుఁడు=అయినట్టిగుణములచేనిండినమనుష్యుఁడు, అప్పలుకులను=అటువంటిమాటలను, నిబద్ధిగ=నిజముగా, పలుకఁబోవఁడు=సంభాషింపనొల్లఁడు, ఎట్లన=ఏలాగనఁగా, వెల్తికుండ=వెల్తిగానున్నకుండ, తాన్=ఆకుండ, తొలఁకుచునుండుఁగాని=తొనఁకుచుండునుగాని, నిండుఘటంబు=నీటిచేనిండుగనింపఁబడినకుండ, తొలుకునె=తొనఁకునా-అనఁగాఁ దొనఁకదని యర్థము.

తా. వెలితిచాగుకుండ తొనఁకులాడునటులు నీచమానవుఁడెల్లప్పుడు వదరుచుండును. నిండినకుండ దొలఁకాడనివిధముగా గుణములుగలమనుష్యుఁ డధికప్రసంగములకుఁ బోక యుండును.

చ. పలుమఱుసజ్జనుండు ప్రియ♦భాషలుపల్కఁగఠోరవాక్యముల్
పలుకఁడొకానొకప్పు డవి ♦ పల్కినఁ గీడునుగాదు నిక్కమే
చలువకువచ్చి మేఘుఁడొక♦జాడను దావడగండ్లరాల్చినన్
శిలలగునోటు వేగిరమె ♦ శీతలనీరము గాక; భాస్కరా.

టీ. భాస్కరా! సజ్జనుండు=మంచివాఁడు, పలుమఱు=తఱుచుగ, ప్రియభాషలె=మంచిమాటలె, పల్కుచున్ = పలుకుచుండును, కఠోర వాక్యముల్ =పరుషవచనములు, పలుకఁడు=మాటలాడఁడు. ఒకానొకప్పుడు=ఒకానొకసమయమునందు, అవి=ఆపరుషవచనములను, పల్కినన్ =పలికినప్పటికిని, కీడునుకాదు=చెఱుపునుగాదు, నిక్కమే=నిశ్చయమె, చలువకు=చల్లఁదనము కలిగించుటకు, వచ్చి, మేఘుఁడు = మబ్బు, తాన్ = ఆమబ్బు, వడగండ్లన్, రాల్చినన్ =పడవైచినను, వేగిరమె= వేగముగానే, శీతలనీరముగాక=చల్లనైననీరు కాకుండ, శిలలగునోటు=రాళ్లవలెగట్టిగానుండునా? అనఁగా నుండవనుట.

తా. మేఘుఁడెల్లప్పుడు చల్లనినీటిబిందువులనే వర్షించుచుండును. ఒకప్పుడు వడగండ్లను రాల్చుచున్నను నవియు రాళ్లవలె నుండక చల్లనినీరుగానే మాఱును. అట్లె సజ్జనుఁడెప్పుడుమంచిమాటలనే పలుకును. ఒకప్పుడు కఠోరవచనములుపలికిన నవి యపాయముకలిగింపక మంచిమాటలగానే మాఱుచుండును.

ఉ. పాపపుఁద్రోవవానికొకపట్టున మేను వికాసమొందినన్
లోపలదుర్గుణంబె ప్రబలుంగద; నమ్మఁగఁగూడదాతనిన్
బాపటకాయకున్ నునుపు పైపయిఁగల్గినఁ గల్గుఁగాకనే
రూపున దానిలోఁ గల విరుద్ధపుఁ జేఁదునశించు భాస్కరా.

టీ. భాస్కరా! పాపపుఁద్రోవవానికిన్=దుర్మార్గునకు, ఒకపట్టునన్=ఒకసమయమందు, మేను=శరీరము, వికాసము=కాంతి, ఒందినన్=పొందినప్పటికి, లోపలన్=మనస్సులోపల, దుర్గుణంబె=చెడుగుణమె, ప్రబలుంగద=వృద్ధిచెందునుగదా, అతనిన్=వానిని, నమ్మఁగన్ కూడదు=నమ్మగూడదు, పాపటకాయకున్=పాపిడికాయకు,

పై పయిన్ = మీఁదుమీఁదుగా, నునుపు = నున్నఁదనము, కల్గినన్ = కల్గినచో, కల్గుఁగాక = సంభవించుఁగాని, దానిలోన్ = ఆకాయలోపల, కలవిరుద్ధపుఁ జేఁదు = కలిగినవికటమగుచేఁదు, ఏరూపునన్ = ఏవిధముగా, నశించున్ = పోవును - అనఁగా నశింపదని యర్థము.

తా. పాపటకాయకు మీఁదిభాగము నున్నగానుండినను దానిలోనున్న చేఁదుగుణము పోదు. అట్లె దుర్మార్గున కంద మొకవేళ కల్గినను మనస్సులో నున్నదుర్గుణములు పోవు. కావున వాని నమ్మఁగూడదు.

ఉ. పూనినభాగ్యరేఖ చెడిపోయినపిమ్మట నెట్టిమానవుం
డైనను వాని నెవ్వరుఁ బ్రియంబునఁ బల్కరు పిల్వరెచ్చటం
దానది యెట్లొకో యనినఁ దథ్యముపుష్పము వాడి వాసనా
హీనతనొందియున్నయెడ నెవ్వరుముట్టుదురయ్య? భాస్కరా!

టీ. భాస్కరా! పూనినభాగ్యరేఖ = మునుపు తన్నుఁ బొందిన యదృష్టరేఖ, చెడిపోయినపిమ్మటన్ = చెడిపోయినతర్వాత, ఎట్టి మానవుండు + ఐనను = ఎంతగొప్పమనుజుఁడైనను, ఎచ్చటన్ = ఏస్థలమందైనను, వానిని = ఆయదృష్టహీనుని, ఎవ్వరున్ = ఏమానవులును, ప్రియంబునన్ = ప్రేమచేత, పల్కరు = మాటలాడరు, పిల్వరు = రమ్మనరు, తథ్యము = సత్యము, తాన్ + అది, ఎట్లొకో యనినన్ = ఎట్లనిన:- పుష్పము = పువ్వు, వాడి = ఎండిపోయి, వాసనాహీనతన్ = మంచివాసన లేకపోవుటను, ఒంది = పొంది, ఉన్నయెడన్ = ఉన్నట్టిసమయమునందు, ఎవ్వరు = ఏజనులైనను, ముట్టుదురయ్యా = తాఁకుదురా? అనఁగా తాఁకరనియర్థము.

తా. పుష్పము వాడి సువాసనలవిడిచియున్న కాలమున నెవ్వరు స్వీకరింపరు. అట్లె భాగ్యరేఖ చెడియున్న మానవు నెంతటివాఁడై

నను రమ్మని పిల్వరు. మఱియుఁ బ్రియముతో మాట్లాడరు.

ఉ. పూరితసద్గుణంబు గలపుణ్యున కించుక రూపసంపదల్
దూరములైనవానియెడ దొడ్డగఁ జూతురు బుద్ధిమంతు లె
ట్లారయ గొగ్గులైనమఱి యందులమాధురిఁ జూచికాదె ఖ
ర్జూరఫలంబులం బ్రియముజొప్పడ లోకులు గొంట భాస్కరా!

టీ. భాస్కరా! పూరితసద్గుణంబు=నిండయినమంచిగుణము, కలపుణ్యునకున్=కలిగినట్టిపుణ్యాత్మునకు, ఇంచుక=కొంచెము, రూపసంపదల్=సౌందర్యముయొక్క సమృద్ధులు, దూరములు+ఐనన్=లేకపోయినను, వానియెడన్=అట్టివానియెడ, బుద్ధిమంతులు=తెలివిగలవారు, దొడ్డగన్=గొప్పగా, చూతురు=కనుఁగొందురు, ఎట్లు=ఏలాగనఁగా, ఆరయన్=ఆలోచింపఁగా, లోకులు=జనులు, గొగ్గులైనన్=ముడతలుపడియున్నప్పటికిని, ఖర్జూరఫలంబులన్=ఖర్జూరపుఁబండ్లను, ప్రియముచొప్పడన్=వానియందుఁ దమకుఁ బ్రేమగలుగునట్లుగా, కొంట=కొనుచుండుట, మఱి=ఇంకను, అందులన్=ఆఫలములయందున్న, మాధురిన్=తియ్యఁదనమును, చూచి కాదె=చూచియేకదా.

తా. ఖర్జూరఫలములందముగఁ గనఁబడకపోయినను వానియందుఁగలతియ్యఁదనమును జూచి జనులందఱు ప్రేమచేతఁగొనుచుందురు. అట్లె సద్గుణంబులు గలవానికి నందము లేకపోయినను బుద్ధిమంతులు వానిని గొప్పవానినిగాఁ జూచి గౌరవించుదురు.

ఉ. ప్రల్లదనంబుచే నెఱుకపాటొకయింతయు లేక యెచ్చటన్
బల్లిదుఁడైనసత్ప్రభు నబద్ధము లాడినఁ దుంగిపోదు రె
ట్లల్లసభాస్థలిం గుమతులై శిశుపాలుఁడు దంతవక్త్రుఁడుం
గల్లలు కృష్ణునిం బలికి కాదె హతంబగుటెల్ల భాస్కరా.

టీ. భాస్కరా! ప్రల్లదనంబుచేఁ = వదరుఁబోతుఁదనము చే, ఎఱుక పాటు = జ్ఞానము, ఇంచుక లేక = కొంచమైనను లేక, ఎచ్చోటఁ = ఏస్థలమునందయినను, బల్లిదుఁడు = బలవంతుఁడు, అయినప్రభుని = అయినట్టిమంచి ప్రభువునిగుఱించి, అబద్ధములాడినన్ = కల్లలాడినచో, (అనఁగానిందించినచో) క్రుంగిపోదురు = నశింతురు. ఎట్లు = ఎట్లనఁగా, శిశుపాలుఁడు, దంతవక్త్రుఁడును, హతంబగుటెల్లన్ = చంపఁబడుటంతయుయోచింప, అల్లసభాస్థలిన్ = ధర్మరాజురాజసూయయాగమునందలిసభలో, కృష్ణునిన్ = కృష్ణమూర్తినిగుఱించి, కల్లలుపల్కుటకాదే = అబద్ధములాడుట నేకదా. అనఁగానిందించుటవలన నేకదా?

తా. ధర్మరాజు చేయురాజసూయయాగమునఁ గూడినసభలోఁ గ్రిందుమీఁదులుచూచుకోక శిశుపాలదంతవక్త్రులు కృష్ణుని నిందించియతనిచేత మృతినొందిరి. అట్లు మానవుఁడుజ్ఞానము లేకుండ బలవంతుఁడగుప్రభువును నిందించినచోఁ దప్పక మృతినొందును.

పురా. పూర్వము శిశుపాలుఁడనురాజు చేదిదేశమును పాలించు చుండెను. అతనికి దంతవక్త్రుఁ డనునొకసోదరుఁడు కలఁడు. వారిరువురు మిగులదుర్మార్గులు; మఱియుఁ గృష్ణునికిఁ బరమశత్రువులు. వారిరువురు ధర్మరాజు చేయుచున్న రాజసూయయాగమునకుఁ దక్కినరాజులవలె నాహూతులై పోయిరి. ఆయాగాంతమున ధర్మరాజు భీష్మాదులయనుజ్ఞవడసి కృష్ణునిసభలోఁబూజించుచుండెను. అది చూచి శిశుపాలుఁడు దంతవక్త్రుఁడునుసభలో లేచినిలువంబడి "కృష్ణుఁడు గొల్లవాఁడనియుఁ బూజార్హుఁడు కాఁడనియు" ననునట్టి కొన్ని ప్రల్లదంబులు పలికిరి. అందులకుఁ గృష్ణుఁడు సహింపలేక యాక్షణమందె నేర్పుచేత శిశుపాలుని సంహారించి తరువాత నొకకొన్ని దినములలోనే దంతవక్త్రునిగూడఁ జంపెను.

ఉ. ప్రేమను గూర్చి యల్పునకుఁ బెద్దతనంబును దొడ్డవానికిం
దా మతితుచ్ఛపుంబని నెదం బరికింపక యీయరాదుగా
వామకరంబుతోడఁ గుడువం గుడిచేత నపానమార్గముం
దోమఁగవచ్చునే మిగులఁ దోఁచనిచేఁతలు గాక భాస్కరా.

టీ. భాస్కరా! ప్రేమను గూర్చి = తమకోరుటయందుండు ప్రేమమును బురస్కరించికొని, అల్పునకున్ = నీచునకు, పెద్దతనంబును = గొప్పయుద్యోగమును, దొడ్డవానికిన్ = గొప్పవానికి, తాము = ప్రభువు లైనవారు, తుచ్ఛపుంబని = నీచపుఁబనిని, ఎదన్ = మనస్సునందు, పరికింపక = యోజింపక, ఈయరాదుగా = ఈయఁగూడదుకదా. ఎట్లనఁగా: మిగులన్ = మిక్కిలి తోఁచనిచేఁతలు కాక = ఆలోచన లేనికార్యములు గాని, వామకరంబుతోడన్ = ఎడమచేతితో, కుడువన్ = తినుటయు, కుడిచేతన్ = కుడిచేతితో, అపానమార్గమున్ = గుదస్థానమును, తోమఁగన్ = తూళన చేయుటయు, వచ్చునే = కూడునా? అనఁగాఁ గూడ దని యర్థము.

తా. లోకములో మానవునికి నెడమచేతితోఁ దినుటయు గుడిచేతితో గుదతూళనము చేసికొనుటయు నెంతయుఁ దగదు. అట్లె ప్రభువులకు నీచునికి గొప్పయధికార మిచ్చుటయు, గొప్పవారికి నీచపుఁబని చెప్పుటయుఁ గూడదు.

చ. ఫలమతిసూక్ష్మమైనను నృపాలుఁడుమంచిగుణాఢ్యుఁడైనచో
నెలమి వివేకు లాతనికపేక్ష యొనర్తు రదెట్లు చంద్రికా
విలసన మైనఁ దా మనుభవింపఁ జకోరము లాసఁ జేరవే
చలువ గలట్టివాఁడగుటఁ జందురునెంతయుఁగోరి భాస్కరా.

టీ. భాస్కరా! నృపాలుఁడు = రాజు, మంచిగుణాఢ్యుఁడు = మంచిగుణములచే నిండినవాఁడు, ఐనచోన్ = అయినట్టయిన,

ఫలము=ఆ ప్రభువువలనఁ గలుగులాభము, అతిసూక్ష్మము=మిక్కి లిస్వల్పము, ఐనను=అయినప్పటికిని, వివేకులు=బుద్ధిమంతులు, ఎలమిన్=సంతోషముచే, అతనికిన్=ఆ ప్రభువుకోసము, అపేక్ష ఒనర్తురు=కోరుచుందురు.అది ఎట్లు=అది యేలాగుననఁగా, చంద్రికావిలసనము ఐనన్=వెన్నెలయొక్క కాంతిమాత్రమే యయిన నను, చకోరములు = వెన్నెలపులుఁగులు, చలువ గలట్టివాఁడు= చల్లదనముకలవాఁడు, అగుటన్ = అయినకారణముచేత, ఎంతి యున్=మిక్కిలి, చందురున్=చందమామను, కోరి=కాంక్షించి, తాము=ఆపక్షులు, అనుభవింపన్=ఆవెన్నెలకాంతినే పానము చేయుటకు, ఆస= అపేక్షతోన్, చేరవే=ఆచంద్రునిసమీపము నకుఁ బోవా? అనఁగాఁ బోవుచుండునని యర్థము.

తా. చకోరపక్షులు చంద్రునివలనఁ దమకుఁ గాంతిమాత్రమే కాని విశేషఫలము లేకపోయినను జల్లనివాఁడనుకారణమున నాతనిరాక గోరుకొనుచుండును. అట్లె రాజు మంచివాఁడయినచో నతనివలనఁ గలిగినఫలము మిగులఁ దక్కువైనను సంతసముతో నాతనినే యపేక్షించుచుండురు.

ఉ. బంధురసద్గుణాఢ్యుఁ డొకపట్టున లంపట నొందినయైన దు
స్సంధి దలంపఁ డన్యులకుఁ జాలహితంబొనరించుఁ గాక శ్రీ
గంధముఁ జెక్కఁ దాఁగిలుచుఁ గాదె శరీరుల కుత్సవార్థమై
గంధములాత్మఁ బుట్టఁ దరుఁగంబడియుండుటలెల్ల భాస్కరా.

టీ. భాస్కరా: బంధురసద్గుణాఢ్యుఁడు-బంధుర=ప్రకాశించెడి, సద్గుణ=మంచిగుణములచే, ఆఢ్యుఁడు=నిండినవాఁడు, ఒకపట్టునన్=ఒకసమయమునందు, లంపటన్=ఆయాసమును, ఒందియైనను=పొందినప్పటికిని, అన్యులకున్=ఇతరులకు,చాలన్=అధిక

ముగా, హితంబుర్ = మేలును, ఒనరించుర్ = చేయునుగాని, దుస్సంధిర్ = ప్రతికూలమైనదానిని, తలంపఁడు = యోజింపఁడు. శ్రీగంధపుఁజెక్క = మంచిగంధఁపుజెక్క, రాగిలుచుర్ = ప్రకాశించుచు. గంధములు = పరిమళములు, ఆత్మ = తనయందు, పుట్టర్ = పుట్టునట్లుగా, తరుగంబడి = తగ్గిపోయియుండుట, ఎల్లశరీరుల కున్ = జంతువులన్నిటికిని, ఉత్సవార్థము = వేడుకనిమిత్తము, ఐకాదె = అయియేకదా? అనఁగా నవునని యర్థము.

తా. మంచిగంధపుఁజెక్క సువాసనలు తనయందుఁ గలుగునట్లుగాఁ దరిగిపోవుచు జనులకు వేడుక కలిగించునట్లు మంచి గుణములు కలవాఁడు తా నెక్కువకష్టను పొందుచున్నను, బరుల కపకారము చేయఁదలంపక మేలే చేయుచుండును

చ. బలముదొలంగుకాలమునఁ బ్రాభవసంపద లెంతధన్యుఁడున్
నిలుపుకొనంగనోపఁ డిది నిశ్చయ మర్జునుఁ డీశ్వరాదులం
గెలిచినవాఁడుబోయలకు గీడ్పడిచూచుచు గృష్ణుభార్యలం
బలువుర నీయఁడే నిలువఁ బట్ట సమర్థుఁడు కాఁడె భాస్కరా.

టీ. భాస్కరా! బలము = దైవబలము, తొలంగుకాలమునన్ = పోవుసమయమునందు. ఎంతధన్యుఁడున్ = ఎట్టిసంపన్నుఁడును, ప్రాభవసంపదలు = ప్రభుత్వసంపదలు, నిలుపుకొనంగన్ = నిలుపుకొనుటకు, చాలఁడు = సరిపోఁడు, అది = ఆమాట, నిశ్చయమై = నిజమె, ఈశ్వరాదులన్ = ఈశ్వరుఁడు మొదలగువారిని, గెలిచినవాఁడు = జయించినవాఁడగు, అర్జునుఁడు, బోయలకున్ = బోయవాండ్రకు, కీడ్పడి = లోఁబడి, చూచుచు, కృష్ణుభార్యలన్ = కృష్ణమూర్తి భార్యలను, నిలువఁబట్టన్ = నిలుపుకొనుటకు, సమర్థుఁడు కాక = సరిపోక, పలువురన్ = పెక్కండ్రను, ఈయఁడే = బోయలకు

నిచ్చినాఁడు కాఁడా? అనఁగా ఇచ్చె నని యర్థము.

తా. శివుఁడు మొదలగువారిని జయించినయర్జునుఁడు కృష్ణు నిర్యాణ మైనతరువాత నాతనిభార్యలను బోయలనుండి తప్పింప శక్తి లేక వారల కిచ్చివేసెను. కావున దైవబలము లేనప్పు డెంతటిధన్యుఁడును దనప్రభుత్వసంపదల నిలుపుకొనఁజాలఁడు.

పురా. బలరామకృష్ణులు నిర్యాణము పొందినపిమ్మట వారల భార్యలను గాపాడుటకు నర్జునుఁడుమాత్ర ముండెను. ఇట్లుండ నొక నాఁడు మ్లేచ్ఛులు కృష్ణునిపై నున్నకోపమును పురస్కరించుకొని యతనిభార్యలను బలాత్కారమునఁ దీసికొనిపోవుచుండిరి. అప్పు డర్జునుఁడు వారలతో యుద్ధమునకు నభిముఖుఁ డాయెను. కాని వారల గెలువ లేకపోయెను. అంతవారలు కృష్ణభార్యలలోఁ బెక్కండ్రఁ దీసికొనిపోయిరి.

చ. బలయుతుఁ డైనవేళ నిజబంధుఁడు తోడ్పడుఁగాని యాతఁడే
బలము తొలంగెనేని తనపాలిటిశత్రు వ దెట్లు పూర్ణుఁ డై
జ్వలనుఁడు కానఁగాల్చుతఱిసఖ్యముఁజూపును వాయుదేవుఁడా
బలియుడు సూక్ష్మదీప మగుపట్టున నార్పదెగాలి భాస్కరా.

టీ. భాస్కరా! బలయుతుఁడు=బలవంతుఁడు, ఐనవేళన్=అయిన సమయమందు, నిజబంధుఁడు=తనచుట్టము, తోడ్పడుఁగాని=సహాయపడును గాని, ఆతఁడే=ఆతనిచుట్టమే, బలము, తొలంగెనేని = తాను విడిచిపెట్టియున్నట్టయిన, తనపాలిటిశత్రువు=తనకు శత్రువే యగును. అది,ఎట్లు=ఏలాగనఁగా, జ్వలనుఁడు=అగ్నిహోత్రుఁడు, పూర్ణుఁడై =నిండుబలము గలవాఁడయి, కానన్=అడవిని, కాల్చుతఱిన్=కాల్చునట్టి సమయమందు, వాయుదేవుఁడు=గాలి, సఖ్యము=స్నేహము, చూపును=కనఁబఱుచును కాని, ఆబలియుఁ

డు=ఆయగ్నిహోత్రుఁడు, సూక్ష్మదీపము = చిన్నదీపము, అగుప ట్టునన్=అయినట్టిసమయమునందు, గాలి, ఆర్పిదె=నశింపఁజేయు దా? అనఁగా నశింపఁజేయుచున్నదనుట.

తా. అగ్నిహోత్రుఁడు నిండుబలము గలవాఁడయి యడవిని గాల్చునట్టి సమయమున వాయువు సఖ్యము చూపుచు నతనికి తోడుపడునట్లు లోకమున మానవుఁడు బలవంతుఁడై యున్న ప్పుడు తోడుపడుచుండును. కాని యగ్ని చిన్నదీప మైనసమయ మునందు నావాయువే శత్రువై యార్పుచున్నట్లు మానవునికి బలము లేనప్పుడు పూర్వము సఖ్యము చూపినవాఁడె శత్రువయి చంపుచుండును.

ఉ. బల్లిదుఁడైనసత్ప్రభువుపాయక యుండినఁగాని రచ్చలోఁ
జిల్లరివారు నూఱుగురు సేరినఁ దేజము గల్గ దెయ్యెడన్
జల్లనిచందురుం డెడసి సన్నపుఁజుక్కలు కోటి యున్న రం
జిల్లునె వెన్నెలల్ జగముచీఁకటు లన్నియుఁబాయభాస్కరా.

టీ. భాస్కరా! బల్లిదుఁడు=బలవంతుఁడు, ఐనసత్ప్రభువు=అ యినట్టిమంచిరాజు, రచ్చలోన్=సభలో, పాయక=విడువక, ఉం డినఁగాని=ఉండవలయునుగాని, చిల్లరివారు=సాధారణులు, నూ ఱుగురు=నూఱుమంది, చేరినన్=కూడినప్పటికిని, ఎయ్యెడన్=ఎ చ్చటను, తేజము=కాంతి, కలుగదు=లభింపదు. ఎట్లనఁగా: చల్ల నిచంద్రుఁడు=చల్లఁదనము నిచ్చెడిచంద్రుఁడు, ఎడసి=లేకుండఁగా, సన్నపుఁజుక్కలు=చిన్ననక్షత్రములు, కోటి=కోటిసంఖ్య,ఉన్నన్= ఉన్నప్పటికి, వెన్నెలల్=వెన్నెలలు,జగముచీఁకటులు అన్నియున్= లోకముయొక్కచీఁకట్లన్నియు, పాయన్ = పోవునట్లుగా, రంజి ల్లున్+ఎ=ప్రకాశించునా? అనఁగాప్రకాశింపవని యర్థము.

తా. చంద్రుఁ డున్నచో మంచివెన్నెలలు కలుగును గాని న క్షత్రము లెన్ని యున్నను జగమునందలి చీకట్లు నశించునట్లు వెన్నెల ప్రకాశింపదు. అట్లె సభలో మంచిరాజుండినఁ గాంతిగల్గును గాని చిల్లరివా రెందఱున్నప్పటికిని లాభము లేదు.

చ. భుజబలశౌర్యవంతు లగుపుత్త్రులఁ గాంచినవారి కెయ్యెడన్
నిజహృదయేప్సితార్థములు నిక్కము చేకురుఁ గుంతిదేవికిన్
విజయబలాఢ్యుఁ డర్జునుఁడు వీరపరాక్రమ మొప్ప దేవతా
గజమును దెచ్చి తల్లివ్రతకార్యముఁ దీర్పఁడె తొల్లి భాస్కరా.

టీ. భాస్కరా! భుజబలశౌర్యవంతులు - భుజబల = బాహుబలము, శౌర్యవంతులు=పరాక్రమము గలవారు, అగుపుత్త్రులన్ = అయినతనయులను, కాంచినవారికి=కన్నవారికి, ఎయ్యెడన్= ఏస్థలమందైనను, నిజహృదయేప్సితార్థములు = తనకిష్టమైనకార్యములు, నిక్కము=నిజముగా, చేకురున్ = నెరవేరును, ఎట్లనగా: తొల్లి = ద్వాపరమున, కుంతీదేవికిన్, విజయబలాఢ్యుఁడు=విజయముచేతను బలముచేతను నిండినవాఁడగు, అర్జునుఁడు, వీరపరాక్రమము=శూరులకు ధర్మమైనప్రతాపము, ఒప్పన్= ఒప్పునట్లుగా, దేవతాగజమును=ఐరావతమును, తెచ్చి=కొనివచ్చి, తల్లివ్రతకార్యము = జననియొక్కవ్రతమును, తీర్పఁడే= నెరవేర్చినాఁడు కాఁడా?

తా. కుంతీదేవికి మిగులబలవంతుఁ డగుపుత్రుఁడర్జునుఁ డుండుటచేత నేనుగగజమును గొనివచ్చి యామెవ్రతము నెరవేర్చినాఁడు. కావున లోకములో బలశాలు లగుపుత్త్రులను బడసినవారికెట్టి దుర్ఘటము లగుకార్యములైన నెరవేరును.

పురా. పూర్వము నారదుఁడు ధృతరాష్ట్రునిభార్య యగుగాం

ధారిని జూడఁబోయి తల్లీ! నీవు మిగులనదృష్టవంతురాలవు. నీపాతి వ్రత్యము వందనీయ మైనది. నీకు నూఱుగురు పుత్త్రులు. నీవం టివారు లోకములో లే రని నుతించెను. అంతటఁ నామె నార దుని జూచి మునీంద్రా! నీ వన్నట్టులు సమస్తము నాకుఁ గలదు కాని నాకుమారులు బుద్ధిహీనులు, అల్పమతులు. పాండవులు మిగులబలవంతులు, బుద్ధిమంతులు. వారివలన నాకుమారుల కపాయము కలుగక మానదని తలంచుచున్నాను. కనుక నా కట్టి భయము పోఁగొట్టుకొనుటకు కేదయిన నుపాయ మున్న యెడలఁ దెలుపు మనవుడు నారదుండు గాంధారితో ని ట్లనియె. అమ్మా, గజగౌరీవ్రత మనునొక వ్రతము గలదు, ఆవ్రతము చేసినచో నీయి ష్టము లన్నియు నెరవేరును.ఇందుల కొక యితిహాసము కలదు. విను ము. పూర్వము శచీదేవి యైరావతము నెక్కి యీశ్వరుని సందర్శిం చునిమిత్తము కైలాసమునకుఁ బోయెను. అంతటఁ బార్వతి తెల్లని యేనుఁగుపైఁ గూర్చుండి వచ్చినశచీదేవిని జూచి తన కట్టివాహన ము లే దనివిచారించుచుండెను.అది తెలిసికొని యీశ్వరుండు త నప్రభావముచే గణనాథుని నొక మదపుటేనుఁగుగాఁ జేసి యామె నందుపైఁ గూర్చుండఁ బెట్టఁగా నాపార్వతి మిగుల సంతసించి పదు నాఱువత్సరము లాయేనుఁగుపైఁ గూర్చుండి విహరించెను. అది మొదలు దేవతలందఱు మంటిచే నేనుఁగును జేసి గౌరీప్రతిమ నందుంచి పదాఱువత్సరములు వ్రతమును జేసి తమతమయభీ ష్టములు నెరవేర్చుకొనిరి. కావున నీవుగూడ నావ్రతమును జేయు మని చెప్పి నారదుఁ డేఁగెను.అంత గాంధారి తనకుమారుల మం టికోసము పంపి తెప్పించి యావ్రతము జేయఁ బ్రయత్నించుచుం డఁగాఁ గుంతీదేవి చూచి మిగుల విచారించుచుండెను. ధర్మ

రాజాదు లది చూచి తల్లివిచారము నడుగఁగా నామె నేను గాంధారి చేయు చున్నవ్రతము చేయుదు ననియు నాగజ మును జేయుటకుఁ దగినమంటిని మీరు తేలే రనియు నందుచే నావ్రతము కొనసాగ దనియు చెప్పి విచారించుచుండఁగా నర్జునుఁడు తల్లిని జేరఁబోయి యి ట్లనియె. అమ్మా! నీవు విచారము నొందకుము. నీవు గజమును జేయుటకుఁ జాలినంత మన్ను లేదని యూ విచారించుచున్నావు? నీకామంటితో నేమి ప్రయోజనము. ఇదిగో నైరావతమునే కొనివచ్చుచున్నా నని చెప్పి దేవలోకమునకుఁ బోయి యైరావతమును గొనివచ్చి తల్లియొక్క వ్రతమును జేయించెను.

ఉ. భూనుతులైన దేవతలు పూర్వము కొందఱు వావివర్తనల్
మాని చరింపరో యనుచు మానవు లట్ల చరింపఁబోల దం
భోనిధులన్ని యుందనదు పుక్కిటఁ బట్టినగస్త్యుఁ డంచు నా
పూనిక కెవ్వఁడోపునది పూర్వమహత్త్వమునుమ్ము భాస్కరా.

టీ. భాస్కరా! భూనుతులు = భూలోకజనులచే నుతింపఁబడు, దేవతలు కొందఱు, పూర్వము=పూర్వకాలమందు, వావి= వరుసను, వర్తనలు=మర్యాదలను, మాని=విడచిపెట్టి, చరింపరో=చరింపలేదా? అనుచు=అని పల్కుచు, మానవులు, అట్లు+ అ=ఆదేవతలు చరించినట్లుగా, చరింపన్=ప్రవర్తించుటకు, పోలదు=మంచిదికాదు. ఎట్లనన్:అగస్త్యుఁడు=అగస్త్యమహాముని, అంభోనిధులు అన్నియున్=సముద్రముల నన్నిటిని, తనదు పుక్కిటన్=తననోటిలో, పట్టి నంచున్=ఉంచినాఁడని, ఆపూనికకున్=అగస్త్యుఁడు చేసినయాప్రయత్నము చేయుటకు, ఎవ్వఁడు ఓపున్= ఎవఁడు సమర్థుఁడు? అనఁగ నెవ్వఁడు సమర్థుఁడు కాఁ డని యర్థము.

అది=అట్లు చేయుట, పూర్వమహత్త్వము సుమ్ము = పూర్వులయొక్క గొప్పతనము సుమీ.

తా. పూర్వము దేవతలు కొందఱు తప్పుమార్గములం బ్రవర్తించిరని మానవు లట్లు చేయఁగూడదు. ఏల చేయఁగూడదనినచో అగస్త్యుఁడు సముద్రములఁ బుడిసిటఁ బట్టినట్లుగ మానవు లెవ్వరైనఁ బట్టఁగలరా? వారిశక్తి మిగులగొప్పది కనుక వారితో మనము సాటిని దెచ్చుకోరాదు.

ఉ. భూపతి కాత్మబుద్ధి మదిఁ బుట్టనిచోటఁ బ్రధాను లెంతప్ర
జ్ఞాపరిపూర్ణు లైనఁ గొనసాగదు కార్యము కార్యదక్షులై
యోపినద్రోణభీష్మకృపయోధు లనేకులు గూడి కౌరవ
క్ష్మాపతికార్య మేమయినఁ జాలిరె చేయఁగ వారు భాస్కరా.

టీ. భాస్కరా! భూపతికిన్=రాజునకు, ఆత్మబుద్ధి=స్వకీయమైనబుద్ధి—అనఁగాఁ గార్యాలోచన యనుట, మదిన్=మనస్సునందు, పుట్టనిచోటన్=పుట్టనిసమయమునందు, ప్రధానులు=మంత్రులు, ఎంతప్రజ్ఞాపరిపూర్ణులు=ఎటువంటిబుద్ధితో నిండినవారయినను, కార్యము=పని, కొనసాగదు=నెరవేరదు. ఎట్లనః కార్యదక్షులయి=కార్యములు నెరవేర్చుటయందు నేర్పరులయి, ఓపిన=చాలియున్న, ద్రోణ ... యోధులు=ద్రోణుఁడు, భీష్ముఁడు, కృపుఁడు మొదలుగాఁ గలవీరులు, అనేకులు=పెక్కండ్రు, కౌరవక్ష్మాపతికార్యము = దుర్యోధనునికార్యమును, చేయఁగన్=నెరవేర్చుటకు, చాలిరె=సరిపోయినారా? అనఁగా కార్యము నెరవేర్పలేకపోయినా రనుట.

తా. కొంచెమైనను గార్యాలోచన లేనిదుర్యోధనునికార్యమును కార్యదక్షులైనను భీష్మాదులు నెరవేర్పలేకపోయిరి. కనుక

రాజునకు స్వకీయమైనయాలోచన లేనప్పుడు మంత్రు లెంతగొప్పవా రయినను కార్యము నెఱవేర్పలేరు.

ఉ. భూరిబలాఢ్యుఁ డైనఁ దలపోయక విక్రమశక్తిచే నహం
కారమునొందుటల్ తగవుగా దతఁ డొక్కెడమోసపోవుఁగా
వీరవరేణ్యుఁ డర్జునుఁడు విల్లికి నే నధికుండ నంచుఁ దా
నూరక వింటి నెక్కిడఁగ నోపఁడు కృష్ణుఁడు లేమి భాస్కరా.

టీ. భాస్కరా! తలపోయక = ఆలోచింపక, భూరిబలాఢ్యుఁడు=గొప్పబలశాలి, ఐనన్=అయినప్పటికి, విక్రమశక్తిచేన్ =పరాక్రమాతిశయముచే, అహంకారము = నేనే సర్వమును చేయుచున్నా ననుగర్వమును, ఒందుటల్=పొందుటలు, తగవు గాదు= యుక్తము కాదు, అతఁడు=ఆబలాఢ్యుఁడు, ఒక్కెడన్ = ఒకస్థలమందు, మోసపోవుఁగా= మోసపోవుచుండును గదా! ఎట్లనఁగా: వీరవరేణ్యుఁడు=వీరులలో గొప్పవాఁడగు, అర్జునుఁడు, వింటికిన్= ధనుస్సునకు, నేను, అధికుండన్ = గొప్పవాఁడను-అనఁగా గొప్పవిలుకాఁడను, అంచున్ =అని పల్కుచు, కృష్ణుఁడు, లేమిన్ = లేకపోవుటచేత, ఊరక = మిన్నక, వింటిన్ =ధనుస్సును, ఎక్కిడఁగన్ = ఎక్కువెట్టుట కయినను, ఓపఁడు=శక్తుఁడు కాఁడు.

తా. అర్జునుఁడు ముల్లోకములలోను దా నొకగొప్పవిలుకాఁడని గర్వపడుచుఁ, గృష్ణనిర్యాణానంతరమునఁ గృష్ణునిభార్యలను రక్షించునిమిత్తముఁ దనవింటి నైన నెక్కువెట్టలేకపోయెను. అట్లు మానవుఁడు తా నెంతబలవంతుఁ డైనను నేనే గొప్పబలవంతుఁడనని గర్వింపఁగూడదు. అట్టిబలవంతుఁడు గూడ నొక్కొకసమయమున మోసపోవుచుండును.

ఉ. భ్రష్టున కర్థవంతు లగుబాంధవు లెందఱు గల్గినన్ నిజా

దృష్టము లేదు గావున దరిద్రతఁ బాపఁగ నేరు సత్కృపా
దృష్టిని నిల్పి లోకుల కతిస్థిరసంపద లిచ్చు లక్ష్మి యా
జ్యేష్ఠ కదేటికిం గలిగఁ జేయదు తోడనె పుట్టి భాస్కరా. 97

టీ. భాస్కరా! భ్రష్టునకున్=పనికిమాలినవానికి, అర్థవంతులు=ధనవంతులు, అగు బాంధవుల్=అయినట్టిచుట్టములు, కలిగినన్=కలిగినప్పటికిని, నిజాదృష్టము= తనయొక్క భాగ్యరేఖ, లేదు కావునన్=లేదు కనుక, దరిద్రతన్=వానియొక్క బీదతనమును, పాపన్ కన్ లేరు=పోఁగొట్టలేరు. ఎట్లనన్: సత్కృపాదృష్టిని=మంచిదయతోఁ గూడినచూపును, నిల్పి=మానవులయందుంచి, లోకులకున్=జనులకు, అతిస్థిరసంపదలు=మిక్కిలిశాశ్వతమైనయైశ్వర్యములు, ఇచ్చులక్ష్మి=ఇచ్చునట్టిలక్ష్మీదేవి, తోడనె=జ్యేష్ఠతోఁగూడనె, పుట్టి=జన్మించి, అనఁగాఁ జెల్లెలై పుట్టి యనియర్థము. జ్యేష్ఠకున్=పెద్దమ్మకు. అదేటికిన్=అది యెందుచేత, కలుగఁజేయదు=భాగ్యముల నీయదు.

తా. లక్ష్మీదేవి దయామయము లగుతనచూపులు లోకులపై నిల్పి యధికైశ్వర్యముల నిచ్చుచుఁ దనతోఁ బుట్టినదైనను జ్యేష్ఠకైశ్వర్యముల నీయలేకున్నది. అట్లె భ్రష్టునకు ధనవంతులగుబంధువు లెందఱున్నను వానియొక్క పేదఱికమును మాన్పలేరు.

చ. మదిఁ దను నాసపడ్డయెడ మంచిగుణోన్నతుఁ డెట్టిహీనునిన్
వదలఁడు మేలుపట్టున నవశ్యము మున్నుగ నాదరించుఁ గా
త్రిదశవిమానమధ్యమునఁ దెచ్చి కృపామతి సారమేయమున్
మొదల నిడండె ధర్మజుఁడు మూఁగి సురావళిచూడ భాస్కరా.

టీ. భాస్కరా! మంచిగుణోన్నతుఁడు=సుగుణములచే నధికుఁ

డయినవాఁడు, తనుఁ=తన్నునుగూర్చి, మదిఁ=మనస్సునందు, ఆసపడ్డనొడఁ = ఆశించినసమయమునందు, ఎట్టిహీనునిఁ=ఎటు వంటినీచునినైనను, వదలఁడు = విడిచిపెట్టఁడు, మేలుపట్టునఁ= దాను మేలు పొందెడునవసరమున, అవశ్యము=తప్పకుండ' ము న్నుగఁ=ముందుగా, ఆదరించుఁ గా=ప్రేమించును గదా? ఎట్లనఁ: ధర్మరాజు, కృపామతిఁ=దయాస్వభావముచేత, సారమేయముఁ=కుక్కను, తెచ్చి=తీసికొనివచ్చి,సురావళి=దేవతాసమూహము, సూఁగి=చుట్టుకొని, చూడఁ=చూచుచుండఁగా, త్రిదశవిమానమధ్యమునఁ = దేవతలవిమానమునందు, మొదలఁ= ముందుగా,ఇడండె=కూర్చుండఁబెట్టలేదా? అనఁగాఁ గూర్చుండఁ బెట్టెనని యర్థము.

తా. ధర్మరాజు తన్ను మొదటినుండియు వెంబడించివచ్చుచున్నకుక్కను దేవత లాశ్చర్యము చెందునట్లు దేవవిమానము మీఁదఁ గూర్చుండఁబెట్టెను. అట్లె సుగుణవంతుఁడు తన్ను నాశ్రయించినవాఁ డెంతహీనుఁడైనను వానిని వదలఁడు మఱియు సమయము వచ్చినప్పుడు ముందుగా నాదరించుచుండును.

పురా. ధర్మరాజు పరీక్షిత్తునకుఁ బట్టము గట్టి సోదరులతోను భార్యతోను వనమున కేగుచుండెను. అతఁ డట్లు కొంతదూరము పోవునప్పటికి ద్రౌపది సహదేవుఁడు నకులుండు అర్జునుఁడు భీముఁడు క్రమముగాఁ బ్రాణముల విడిచి పైలోకమున కేగిరి. కాని తనపురములోనుండియుఁ దన్ను వెంబడించివచ్చుచున్నయొకకుక్కమాత్రము తనతో నుండెను. ధర్మజుఁడు సోదరాదులమృతికి వగవక మఱికొంతదూరము పోవునప్పటికి నతని కెదురుగా దేవతలోకవిమానమును గొనివచ్చి నిలిపి యందు ధర్మరాజును గూ

ర్చుండఁ బ్రార్థించిరి. అంత ధర్మరాజు మొదటినుండియుఁ దనతో వచ్చుచున్నకుక్క నందుపైఁ గూర్చుండఁబెట్టుకొనెను. కాని సురలు వలదని వారించిరి. అయిన నతఁడు వారలకుఁ దగినయుత్తరము లిచ్చి యొప్పించి కుక్కతోఁగూడ విమానములోఁ గూర్చుండి దేవలోకమున కేగెను.

ఉ. మాటల కోర్వఁజాలఁ డభిమానసమగ్రుఁడు ప్రాణహానియౌ
చోటులనైనఁ దానెదురుచూచుచునుండుఁ గొలంకులోపలన్
నీట మునింగినప్పు డతినీచము లాడిన రాజరాజు పో
రాట మొనర్చి నేలఁబడఁడాయెనె భీమునిచేత భాస్కరా. 81

టీ. భాస్కరా! అభిమానసమగ్రుఁడు=అభిమానముచే నిండినవాఁడు, ప్రాణహాని=ప్రాణముల కపాయము, అవుచోటులనైనన్=అవునట్టిస్థలములయం దయినను, తాను=ఆయభిమానసంపన్నుఁడు, ఎదురుచూచుచునుండున్=సిద్ధపడి నిరీక్షించుచుండును గాని, మాటలకున్=పరులు తన్నాడినపలుకులకు, ఓర్వఁజాలఁడు=సహింపలేఁడు, రాజరాజు = రాజులకు రాజయినదుర్యోధనుఁడు, కొలఁకులోపలన్=సరస్సులో, మునింగినప్పుడు=జలస్తంభనచే నీటిలో దాఁగియున్నప్పుడు, అతినీచము లాడినన్=ధర్మరాజు తుచ్ఛవచనములు పలుకఁగా, పోరాటము = యుద్ధము, ఒనర్చి=చేసి, భీమునిచేతన్, నేలన్=భూమియందు, పడఁడాయెనె=తొడలు విఱిగి పడలేదా? అనఁగా మృతినొందినాఁడని యర్థము.

తా. పాండవయుద్ధాంతమున దుర్యోధనుఁడు శత్రుల కోడి యొకకొలంకులో జలస్తంభనచే దాఁగియుండి ధర్మరాజాదులనీచవచనముల కోర్వలేక యుద్ధముచేసి భీమునిచేఁ జచ్చె. అట్లె అభిమానవంతుఁడు తనప్రాణములనైన విడుచునుగాని పరులు

పల్కు కారుమాటల సహింపలేఁడు.

పురా. పాండవులును గౌరవులును రాజ్యముకయి పోరాడిరి. ఆయుద్ధములో నుభయపక్షములవారు పెక్కండ్రు నశించిరి. అయినను బ్రస్తుతమునఁ బాండవులసైన్య మధికముగా నుండెను. దుర్యోధనునికిఁ గృతివర్మ కృపాచార్యుఁడు అశ్వత్థామ యనుము వ్వురు యోధులుమాత్రము కలరు. అందువలన దుర్యోధనుఁడు భయపడి యాయోధత్రయమును సైన్యమును సమకూర్ప నంపి తా నొకతటాకమున జలస్తంభనవిద్యచే దాఁగియుండెను. అది ధర్మరాజాదులు తెలిసికొని యచటికిఁ బోయి దుర్యోధను నిందిం పఁదొడగిరి. అంత వాఁడు వారిమాటల సహింపలేక తటాకము వెడలివచ్చి భీమునితో ఘోరముగాఁ బోరి ప్రాణముల విడిచెను.

ఉ. మానవనాథుఁ డాత్మరిపుమర్మ మెఱింగినవాని నేలినం
గాని జయింపలేఁ డరులఁ గార్ముకదక్షుఁడు రామభద్రుఁ డా
దానవనాయకుం గెలువఁ డా నెటులోపుఁ దదీయనాభికా
స్థానసుధ న్విభీషణుఁడు తార్క్ష్యుని చెప్పకయున్న భాస్కరా.

టీ. భాస్కరా! మానవనాథుఁడు = రాజు, ఆత్మరిపుమర్మమున్ = తనశత్రువుయొక్క రహస్యమును, ఎఱిఁగినవానిని = తెలిసినవానిని, ఏలినంగాని = చేరఁదీసినఁగాని, అరులన్ = శత్రువుల, జయింపలేఁడు = చంపఁజాలఁడు, ఎట్లనన్; విభీషణుఁడు = రావణునితమ్ముఁడు, తార్క్ష్యుని = రాముని సమీపించి, తదీయ ... సుధన్ - తదీయ = రావణునిసంబంధమైన, నాభికాస్థాన = నాభిస్థలమం దున్న, సుధన్ = అమృతముయొక్క సంగతిని, చెప్పకయున్న = చెప్పకపోయినచో, కార్ముకదక్షుఁడు = విలువిద్యయందు సమర్థుఁ డయిన, రామభద్రుఁడు = రాముఁడు, తాను, ఆ దానవనాయకున్ = ఆ రావణుని, గెలు

వఁగన్=జయించుటకు, ఎటులోపును=ఎట్లు సమర్థుఁ డగును? అనఁగా శక్తుఁడు కాఁ డనుట.

తా. రావణునిబొడ్డునందు నమృతకలశ మున్న దని విభీషణుఁడు రామునితోఁ జెప్పకపోయినచో అతఁ డెంతటివిలుకాఁడయినను రావణుని జంపలేకపోయియుండును. కావున రాజునకు శత్రువులమర్మముల నెఱింగినమానవుఁడు లేనిచో నాతఁడు తన పగవారిని జంపలేఁడు.

పురా. రాముఁడు రావణుని జంపుటకు ఘోర మగుయుద్ధము చేసి వానిశిరస్సుల నేలఁ బడునట్లు చేయుచున్నను వానిశిరస్సులు తిరిగి మొలచుచుండెను. అందుచే రాముఁడు మఱింతకోపముతో రావణునిశిరస్సులఁ ద్రుంచి కొండలంతలేసి ప్రోవులు పెట్టుచుండెను గాని వాఁడు చావలేదు. అంతట రాముఁడు చేయునది లేక చూచుచుండ విభీషణుఁడు రామునియొద్దకు వచ్చి, రావణునినాభియందమృతకలశ మున్న దనియు, దాని ముందుగ నింకింపనిచో వాని తల లట్లె మొలచుచుండు ననియుఁ జెప్పెను. అప్పుడు రాముఁ డాగ్నేయాస్త్రమును దీసికొని ముందుగ నమృతము నింకించి తరువాత సులభముగా వానిని సంహరించెను.

ఉ. మానవుఁ డాత్మకిష్ట మగుమంచిప్రయోజన మాచరించుచోఁ
గానక యల్పుఁ డొక్కఁ డది గాదని పల్కినవానిపల్కుకై
మానఁగఁ జూడఁ డాపని సమంచితభోజనవేళ నీఁగ కా
లూనినవంటకంబు దిన కుండఁగ నేర్చునొటు భాస్కరా.

టీ. భాస్కరా! మానవుఁడు=మనుష్యుఁడు, ఆత్మకున్=మనస్సునకు, ఇష్టము=ప్రియము, అగుమంచిప్రయోజనము=అయినట్టి మంచికార్యమును, ఆచరించుచోన్=చేయునట్టిసమయమునందు,

అల్పుఁడు=నీచుఁడు, ఒకఁడు, కానక=ఆకార్యలాభము తెలిసికోక, అది=ఆకార్యము; కాదని=చేయవలదని, పల్కినన్=చెప్పినచో, వానిపల్కుకై=వానిమాటకోసము, ఆపని=ఆకార్యమును, మానఁగన్=విడిచిపెట్టుటకు, చూడఁడు=ఆలోచింపఁడు. సముచిత భోజనవేళన్=మంచిభోజనసమయమునందు, ఈఁగ కాలూనినవంటకంబు=ఈఁగ కాలు మోపి యాక్రమించుకొనినవంటకమును, తినకుండఁగన్=తినుటను మానివేయుట, నేర్పగునోటు= నేర్పగు నా? అనఁగా వంటకము తినఁబడునని యర్థము.

తా. మానవుఁడు భుజియించునట్టికాలమున నీఁగ వచ్చి కాలు వెట్టి యాక్రమించినంతమాత్రమున నూరకుండక యావంటకమును భుజించును. అట్లు మానవుఁడు తన కిష్ట మగుకార్యము చేయుచున్నప్పుడు నీచుఁ డొకఁడు వచ్చివద్దు వద్దని చెప్పినను వినక తాఁ దలఁచినకార్యమును జేయును.

ఉ. మానిని చెప్పు నెట్లెఱుకమాలిన వాఁ డటు చేసినన్ మహా
హాని ఘటించు నేఘనునికైన నసంశయ ముర్విపైఁ గృపా
హీనత బల్కినన్ దశరథేశ్వరుఁ డంగన మాటకై గుణాం
భోనిధి రాముఁ బాసి చనిపోవఁడెశోకముతోడ భాస్కరా.

టీ. భాస్కరా! ఎఱుకమాలినవాఁడు=జ్ఞానము లేనిమనుష్యుఁడు, మానిని=తనభార్య, ఎట్లు చెప్పును=ఏరీతిఁ జెప్పునో, అటు చేసినన్=అట్లాచరించినచో, ఉర్విపైన్=భూమిమీఁద, ఏఘనునకైనను=ఎంతగొప్పవానికయినను, మహాహాని=గొప్పయాపద, ఘటించున్=సమకూడును, అసంశయము=ఎంతమాత్రము సందియము లేదు, ఎట్లనఁగా కృపాహీనతన్=నిర్దయత్వముచే, పలికినన్=రాము నడవికి పంపి తనకుమారునికి రాజ్య మీవలయునని

చెప్పఁగ, అంగనమాటకయి=తనభార్య యగు కైకేయివాక్యము - కోసము, దశరథేశ్వరుఁడు = దశరథమహారాజు, గుణాంభోనిధి= సుగుణములకు సముద్రమువంటివాఁ డగు, రాముఁ = శ్రీరామ చంద్రుని, పాసి=ఎడఁబాసి, శోకముతోడఁ = రామునియెడఁబా టువలనఁ గలిగినదుఃఖముచేత, చనిపోవఁడె=ప్రాణములఁ ద్యజిం పలేదా? (అనఁగాఁ బ్రాణముల విడిచె ననుట.)

తా. దశరథుఁడు తనభార్య యగుకైక చెప్పినమాటలను జక్కఁగఁ బరిశీలింపక యామెయిష్టప్రకారమున సుగుణవంతుఁ డగురాము నడవికి నంపి తద్వియోగముచేఁ బ్రాణములు విడిచి నట్లు, తెలివి మాలినవాఁడు తనభార్యచెప్పినట్లు ప్రవర్తించిన చోఁ దా నెంతగొప్పవాఁ డయినను గొప్పయాపదలపా లయి నశించును.

చ. మును పొనరించుపాతక మమోఘము జీవులకెల్లఁబూని యా
వెనుకటిజన్మమం దనుభవింపక తీఱదు రాఘవుండు వా
లిని బడనేసి తా మగుడ లీల యదూద్భవుఁడై కిరాతుచే
వినిశితబాణపాతమున వీడ్కొనఁడే తనమేను భాస్కరా.

టీ. భాస్కరా! మునుపు=పూర్వజన్మమందు, ఒనరించుపాత కము=చేసినపాపము, అమోఘము=వృథా పోదు, జీవులకుఁ ఎల్లఁ=ఎల్లప్రాణులకును, పూని = ప్రయత్నించి, ఆవెనుకటిజన్మ మందు=తరువాతిజన్మమునందు, అనుభవింపక=తాను చేసినపాప ఫలమును బొందక, తీఱదు=వలనుపడదు - అనఁగాఁ దప్పక య నుభవించి తీఱవలె నని యర్థము. ఎట్లనఁ:-రాఘవుండు = శ్రీరా ముఁడు, వాలిని=వాలి యనువానరరాజును, పడఁ+ఏసి=చంపి, తాఁ=ఆరాముఁడు, మగుడఁ=తిరిగి, లీలఁ=విలాసముగా, య

దూద్భవుఁడు+ఐ =యదువంశమునఁ బుట్టినవాఁ డయి-అనఁగాఁ గృష్ణావతార మెత్తి, కిరాతుచేఁన్ = ఎఱుకువానిచేతను, వినిశిత బాణపాతమునన్=వాఁడి యగుబాణముయొక్క దెబ్బచే, తనమే నుఁ=తనశరీరము, వీడ్కొనఁడే=విడిచిపెట్టలేదా? అనఁగా మృతి పొందె నని యర్థము.

తా. శ్రీరాముఁడు వాలిని జంపుటవలనఁ గలిగినపాపఫలము ను గృష్ణావతారమున నెఱుకుచే దెబ్బ తిని తనశరీరమును విడిచి పెట్టి యనుభవించెను. కావున నెటువంటిమహానుభావుఁ డయి నను బూర్వజన్మమునఁ జేసినపాపమును దరువాతిజన్మమునఁ ద ప్పక యనుభవింపక తీఱదు.

ఉ. రాకొమరుల్ రసజ్ఞుని దిరంబుగ మన్నన నుంచినట్లు భూ
లోకమునందు మూఢుఁ దమలోపల నుంపరు నిక్కమే కదా?
చేకొని ముద్దుగాఁ జదువు చిల్కను బెంతురు గాక పెంతురే
కాకము నెవ్వరైన శుభకారణ సన్మునిసేవ్య భాస్కరా.

టీ. భాస్కరా!శుభకారణ=శుభము కలిగించుటకు ముఖ్యమై నవాఁడా! సన్మునిసేవ్య = మునులచే నుతింపఁదగినవాఁడా! రాకొ మరుల్=రాజకుమారులు, మన్ననన్ = గౌరవముతో, తిరంబు గన్=నిలుకడగా, రసజ్ఞుని=రసికుఁ డైనవానిని, ఉంచినట్లు=నిలిపి నట్లు, భూలోకమునందున్=భూమిమీఁద, మూఢుని=మూర్ఖుని, తమలోపలన్=తమయింటిలో, ఉంపరు=ఉండనీయరు. నిక్కమే కదా=నిజమే కదా. ఎట్లనన్:ఎవ్వరైనన్=ఎట్టివారలైనను, చేకొ ని=చేతఁబట్టికొని,ముద్దుగన్=ముచ్చటగా, చదువు=చదువుచున్న, చిలుకను, పెంతురుగాని=పెంచుచుందురుకాని, కాకమున్=కాకిని, పెంతురా=పోషింతురా? అనఁగాఁ బోషింపరనియర్థము.

తా. లోకములో మానవులు ముద్దులు గులుకునట్లు పద్యములు చదువుచిలుకను బెంతురు కాని కాకిని బెంపరు. అట్లె రాజులు రసజ్ఞునిఁ జేరఁదీసి పోషించునట్లు మూర్ఖునిఁ బోషింపరు.

ఉ. లోకములోన దుర్జనులలోఁతు నెఱుంగక చేరరాదు సు
శ్లోకుఁడు చేరినం గవయఁ జూతురు చేయుదు రెక్కసక్కెముల్
కోకిలఁ గన్నచోట గుమిగూడి యసహ్యపుఁగూఁత లార్చుచుం
గాకులు తన్నవే తఱిమి కాయము తల్లడ మంద భాస్కరా.

టీ. భాస్కరా! లోకములోనన్=లోకమందు, సుశ్లోకుఁడు=మంచికీర్తి గలవాఁడు, దుర్జనులలోఁతును = దుష్టులయభిప్రాయము, ఎఱుఁగక= తెలిసికొనక, చేరరాదు = దుష్టులయొద్దకుఁ బోఁగూడదు. చేరినన్=ఒకవేళఁబోయినచో, కవయన్=చుట్టుముట్టుటకు, చూతురు = ఆలోచింతురు. ఎక్కసక్కెముల్ = వికటపు మాటలను, చేయుదురు = పల్కుదురు. ఎట్లనన్: కాకులు, కోకిలన్=కోవెలను, కన్నచోటన్=చూచినస్థలమునందు, గుమిగూడి=ప్రోవయి, అసహ్యపుఁగూఁతలన్= చెడ్డకూఁతలను,అర్చుచున్= కూయుచు, కాయము = కోకిలయొక్కశరీరము, తల్లడము అందన్ =వడఁకునట్లుగా, తఱిమి=వెంబడించి, తన్నవే=తన్నవా? అనఁగాఁ బాదములతోఁ దాడించు నని యర్థము.

తా. లోకమునందు మంచివాఁడు దుర్జనులయభిప్రాయము తెలిసికోకుండ వారిని జేరఁగూడదు. అట్లు చేరినచోఁ గాకులు కోకిలమును జూచినప్పుడు చుట్టును మూఁగి రోఁత పుట్టించెడికూఁతలు కూయుచు వెంబడించి తన్నునట్లు దుర్జనులు మంచివానిని జుట్టుముట్టి యెగతాళిచేయుదురు.

ఉ. లోను దృఢంబు గాని పెనులోభినినమ్మి యసాధ్యకార్యముల్

కానక పూనునే నతఁడు గ్రక్కునఁ గూలును నోటిపుట్టిపై
మానవుఁ డెక్కిపోవ నొక మాటు బుటుక్కున ముంపకుండునే
తా నొకలోఁతునం గెడసి దానిఁ దరింపఁగలేక భాస్కరా.

టీ. భాస్కరా! లోను=హృదయము, దృఢంబు గాని=గట్టిది కాని, పెనులోభిని=మిగులఁబేరాశ గలవానిని, నమ్మి=విశ్వసించి, అసాధ్యకార్యముల్=సాధింపరానిపనులను, కానక = తెలిసికోక, పూనునేని=ప్రయత్నించినచో, అతఁడు = ఆమానవుఁడు, గ్రక్కునన్=శీఘ్రముగా, కూలును=నశించును. ఎట్లనన్: మానవుఁడు, ఓటిపుట్టిపై=మిగులశిథిల మైనపడవమీఁద, ఎక్కి=అధిరోహించి, పోవన్=వెళ్లఁగా, తాను=ఆపడవ, ఒకలోఁతునన్ = ఒకలోఁతు గలప్రవాహమునందు, కెడసి=పడి, దానిన్ = ఆప్రవాహమును, తరింపన్ కన్ లేక=దాఁటలేక, ఒకమాటు=ఒకసారి, బుటుక్కు-నన్=బుటుక్కుమని, ముంపక ఉండునే=దానిపై నున్నమానవుని ముంపకుండునా? అనఁగా ముంచును అని యర్థము.

తా. శిథిల మగుపడవమీఁద మానవుఁ డెక్కి మిగులలోఁతు గలయొకజలప్రవాహమును దాఁటుటకుఁ బ్రయత్నించెనేని ఆపడవ యుం దొరగి తప్పక వానిని ముంచివేయును. అట్లె మనుష్యుఁడు దృఢ మగుచిత్తము లేనిలోభిని నమ్ముకొని యొక గొప్పకార్యమునకుఁ బూనినచో వాఁడు వానిమూలమునఁ దప్పక నశించును.

ఉ. వంచన యింత లేక యెటువంటిమహాత్ముల నాశ్రయించినం
గొంచెమె కాని మేలు సమకూడ దదృష్టము లేనివారికిన్
సంచితబుద్ధి బ్రహ్మ ననిశంబును వీఁపున మోచునట్టిరా
యంచకు దుంపతూండ్లు దినగా నాయెఁగదా ఫలమేమిభాస్కరా.

టీ. భాస్కరా ! వంచన=శక్తివంచన, ఇంత లేక=కొంచెమైనను లేకుండఁగ, ఎటువంటిమహాత్ములన్=ఎంతగొప్పవారిని, ఆశ్రయించినను=సేవించినప్పటికిని, అదృష్టము లేనివారికిన్=అదృష్టము లేనట్టిమానవులకు, కొంచెమె కాని=స్వల్పమె కాని, మేలు=శుభము, సమకూడదు=సంభవింపదు, ఎట్లన: సరిచితబుద్ధి=సంగ్రహింపఁబడినబుద్ధిచేతను, అనిశంబును=ఎల్లప్పుడు, వీఁపునన్=వీఁపుచేత, బ్రహ్మను=బ్రహ్మదేవుని, మోచునట్టిరాయంచకున్=మోయుచున్నరాజహంసకు, దుంపతూండ్లన్=తామరతూండ్లను (ఇచ్చట మూలములో "తమ్మితూండ్లు" అనుట యుచితము), తిననాయెఁగదా=తినుటయే సంభవించెనుగదా. ఫలము=బ్రహ్మను మోయుచున్నందులకు ఫలము, ఏమి=ఏమి కలదు? ఏమియు లేదని యర్థము.

తా. లోకముల నిర్మించెడుబ్రహ్మను దనవీఁపుచేత నెల్లప్పుడు మోయుచున్న రాజహంస తక్కినవానివలెఁ దామరతూండ్లభోజనమే చేయుచున్నది. కావున నదృష్టహీనుఁ డెంతగొప్పవారి నాశ్రయించినను సాధారణఫలమే కాని విశేషఫలము లభింపదు.

ఉ. వట్టుచుఁ దండ్రి యత్యధమవర్తనుఁ డైనను గాని వానికిం
బుట్టినపుత్త్రకుండు తనపుణ్యవశంబున దొడ్డధన్యుఁ డౌ
నెట్టన ముష్టివిత్తు మునుపెంత యుఁగొంచెము దానఁబుట్టునా
చెట్టు మహోన్నతత్వమును జెందదె శాఖల నిండి భాస్కరా!

టీ. భాస్కరా ! తండ్రి=జనకుఁడు, వట్టుచున్=కృశించుచు, అత్యధమవర్తనుఁడు=మిక్కిలినీచవర్తనము గలవాఁడు, ఐనన్ కాని=అయినప్పటికిని, వానికిన్=అయ్యధమవర్తనునకు, పుట్టినపుత్త్రుఁడు=కలిగినకుమారుఁడు, తనపుణ్యవశంబునన్=తనయొక్క పూర్వ

పుణ్యమువలన,దొడ్డధన్యుఁడు=గొప్పకృతార్థుఁడు, ఔౕ=అగును-అనఁగా నైశ్వర్యము గలవాఁడగు నని యర్థము.ఎట్లు అనఁ=ఏలా గనఁగా, మఱ్ఱివిత్తు=వటబీజము, మును పు=మొదట, ఎంతయుఁ=మిక్కిలి, కొంచెము=చిన్నదైనప్పటికిని, దానఁ = ఆవిత్తునందు, పుట్టునా చెట్టు=ఉద్భవించినయామఱ్ఱిచెట్టు, శాఖలఁ=కొమ్మలచేత, నిండి, మహోన్నతత్వమును=మిక్కిలిపొడవును, చెందదె=పొందదా? అనఁగాఁ బొందుచున్న దని యర్థము.

తా. మఱ్ఱివిత్తు మిగులఁ జిన్నదైనను దానియందుఁ బుట్టిన చెట్టు మిక్కిలిగొప్పది యయియుండును. అట్లె లోకమునఁ దండ్రి మిక్కిలిహీనుఁడైనను వానికిఁ గల్గుకుమారుఁడు తనపుణ్యముచేత దొడ్డవాఁడగును.

చ. వలనుగఁ గానలందుఁ బ్రతివర్షమునం బులి నాలుగైదుపి
ల్లలఁగను దూడనొక్కటినికాంగను ధేనువు రెండుమూఁడు నేఁ
డులకటు లైన బెబ్బులికుటుంబము లల్పము లాయెనాలమం
దలుగడువృద్ధిచెందవె యధర్మము ధర్మము దెల్ప భాస్కరా.

టీ. భాస్కరా!వలనుగఁ=యుక్తముగా, కానలందుఁ=అడవులయందు, పులి=పెద్దపులి, ప్రతివర్షముఁ=ఏఁటేఁటను, నాలుగైదుపిల్లలను=నాలుగేసియు నైదేసియుఁ బిల్లలను, కనుఁ=కనుచుండును. ధేనువు=ఆవు, రెండుమూఁడునేఁడులకు=రెండుమూఁడువత్సరములకు, దూడ నొక్కటిఁ=ఒక్కదూడను మాత్రమె, కనుఁ=ఈనుచున్నది. అటులైనఁ=ఆలాగైనను, అధర్మముఁ=ఆపులులయొక్క యధర్మమును,ధర్మమును=ఆవులయొక్క ధర్మమును, తెల్పఁ=లోకమునకుఁ బ్రకటించుటకు, బెబ్బులికుటుంబములు=వ్యాఘ్రములయొక్క కుటుంబవృద్ధి, అల్పములాయెను=

తక్కువాయెను. ఆలమందలు = ధేనువులయొక్క షండలు, కడున్ = మిక్కిలి, వృద్ధిచెందవె = వృద్ధిపొందలేదా? అనఁగా వృద్ధి పొందు చున్నవని యర్థము.

తా. అధర్మబుద్ధితో వర్తించుపులికి నేఁటేఁట నాలుగైదు పిల్లలు పుట్టుచున్నను, దానివంశము వృద్ధికి రాకున్నయది. ధర్మ బుద్ధితోఁ బ్రవర్తించుగోవులకు నొక్కొక్కదూడ పుట్టుచున్నను, వానిసంతతి మిగులవృద్ధి చెందుచున్నది. అట్లె యధర్మబుద్ధి గల వానివంశము నశించునుగాని, ధర్మబుద్ధి గలవానివంశము వృద్ధి చెందఁగలదు.

చ. వలవదు క్రూరసంగతి యవశ్యమొకప్పుడు సేయఁబడ్డచోఁ
గొలఁదియె కాక యెక్కువలు గూడవు తమ్ములపాకులోపలం
గలసినసున్న మించుకయు కాక మఱించుక యెక్కువైనచో
నలుగడఁ జుఱ్ఱుచుఱ్ఱుమని నాలుక పొక్కకయున్నె భాస్కరా.

టీ. భాస్కరా! క్రూరసంగతి = దుర్జనసహవాసము, అవశ్యము = తప్పకుండ, వలవదు = మానవలెను, ఒకప్పుడు = ఒక సమయమందు, చేయఁబడ్డచోన్ = దుర్జన సహవాసము చేయఁబడెనేని, కొలఁదియె కాని = కొంచెమె కాని, ఎక్కువలు = అధికముగాఁ జేయుటలు, కూడవు. ఎట్లన: తమ్ములపాకులోపలన్, కలసినసున్నము = రాచినసున్నము, ఇంచుకయ కాక = కొంచెమైనఁగాని, మఱించుక = మఱికొంచెము, ఎక్కువైనచోన్ = అధికమయినయెడల, నలుగడన్ = నలుప్రక్కల, చుఱ్ఱుచుఱ్ఱుమని, నాలుక, పొక్కక యున్నె = పొక్కక యుండునా? అనఁగా బొక్కునని యర్థము.

తా. దుర్జనసహవాసము తప్పక విడిచిపెట్టవలయును. ఒకవే

శఁజేయవలసివచ్చినచోఁ దములపాకులకుఁ దగుమాత్రము సున్న మురాచికొనినచో యుక్తమైనట్లు, దుర్జనసహవాసము కొంచెము గాఁ జేయుటయే యుక్తము. ఆదుర్జనసహవాస మధికముగాఁ జేసినచోఁ దములపాకుల కధికముగా సున్నము రాచుటవలన నాలుక నలుగడలఁ బొక్కు లెక్కునట్లు పెక్కు లపాయములు సంప్రాప్తమగును.

ఉ. వానికి విద్యచేత సిరివచ్చె నటంచును విద్య నేరఁగాఁ
బూనినఁ బూనుఁగాక తనపుణ్యము చాలక భాగ్యరేఖకుం
బూనఁగ నెవ్వఁ డోపు సరిపో చెవి పెంచునుగా కదృష్టతా
హీనుఁడు కర్ణభూషణము లెట్లు గణింపఁగనోపు భాస్కరా.

టీ భాస్కరా! వానికిన్=ఆపురుషునకు, విద్యచేతన్-సిరి=సంపద, వచ్చెన్ అటంచున్=కలిగినదని, విద్యన్=చదువును, నేరన్ కాన్=అభ్యసించుటకు, పూనినన్ పూనున్ కాక=ప్రయత్నము చేసినఁ జేయుఁగాక, తనపుణ్యము=తాను పూర్వజన్మమున దానధర్మాదులు చేసి సంపాదించుకొనినదానమువలనఁ గలిగినసుకృతము, చాలక = సరిపోకున్న చో, భాగ్యరేఖకున్=అదృష్టరేఖనిమిత్తము, పూనఁగన్ = ప్రయత్నించుటకు, ఎవ్వఁడు= ఏమనుష్యుఁడు, ఓపున్=సమర్థుఁ డగును? అనఁగా నెవ్వఁడు సమర్థుఁడు కాఁడని యర్థము. సరిపో=సరే కాని, అదృష్టతాహీనుఁడు=భాగ్యము లేనివాఁడు, చెవి = చెవికన్నము, పెంచునుగాక=వర్ధింపఁగలఁడు కాని, కర్ణభూషణముల్=కర్ణకుండలములను, గణింపఁగన్=సంపాదించుటకు, ఎట్లోపున్=ఎట్లు సమర్థుఁ డగును.

తా. అదృష్టము లేనిమానవుఁడు చెవికన్నము పెంచినం బెంపఁగలఁడు కాని కర్ణకుండలములను సంపాదింపలేఁడు. అట్లే చ

దుపుకొనుటచే నొకరికి సంపద లభ్బినవని తాను ప్రయత్నించి విద్యాభ్యాసము చేసి విద్యను గణింపఁగలఁడు కాని పూర్వపుణ్యము లేకుండ భాగ్యమును సంపాదింపలేఁడు.

ఉ. సంతతపుణ్యశాలి నొకకజాడను సంపద వాసిపోయి తా
నంతటఁ బోక నెట్టుకొనికయప్పటియట్ల వసించియుండు మా
సాంతమునందుఁ జందురుని కన్నికళల్ వెడఁబాసి పోయినం
గాంతి వహింపఁడోటు తిరుకగంబడి దేహము నిండ భాస్కరా.

టీ. భాస్కరా! సంపద = ఐశ్వర్యము, సంతత పుణ్యశాలిన్- సంతత=నిత్యము, పుణ్యశాలిన్ = పుణ్యముచే నొప్పుచున్నవానిని, ఒకజాడను=ఒకవిధముగా, పాసిపోయి=విడిచిపోయి, తాన్=ఆసంపద, అంతటఁ బోక=అంతమాత్రముచేఁ దొలఁగక, నెట్టుకొని= పాదుకొని, అప్పటియట్ల=వెనుకనున్నట్టుగానె, వసించియుండు = నివసించియుండును, ఎట్లనఁగా: మాసాంతమునందు = అమవసనాఁడు, చందురునిన్=చంద్రమామను, అన్నికళల్=కళలన్నియు, వెడఁబాసిపోయినన్ = దేవతల కొక్కొకకళచొప్పున నిచ్చుటచేత విడిచిపోయినప్పటికిని, తిరుగంబడి=మగుడ, దేహము=బింబము, నిండన్=నిండునట్లుగా, కాంతిన్=శోభను, వహింపఁడోటు= పొందఁడా-అనఁగాఁ బొందునని యర్థము. ఓటు అనునది ప్రశ్నార్థకము.

తా. అమవసనాఁడు చంద్రునికళలన్నియు విడిచిపోయినను తాను ప్రతిదినము దేవతలకుఁ దనకళ లర్పించుటవలనఁ గలిగిన పుణ్యముంబట్టి తిరిగి తనబింబమునిండఁ గళలఁ దాల్చుచున్నట్లు, ఎల్లప్పుడు పుణ్యము లొనర్చువాని నొకవిధమున సంపద విడిచి

పోయినను, అతఁ డొనరించుపుణ్యముచేఁ దిరిగి యాసంపదలఁ బొందఁగలఁడు.

చ. సకలజనప్రియత్వము నిజంబుగఁ గల్గినపుణ్యశాలి కొ
క్కొకయెడ నాపదైనఁ దడవుండదు వేగమె పాసిపోవుఁగా
యకలుషమూర్తియైనయమృతాంశుఁడు రాహువుతన్ను మ్రింగినం
టకటక మాని యుండఁడె దృఢస్థితి నెప్పటియట్ల భాస్కరా.

టీ. భాస్కరా! సకలజనప్రియత్వము = అందఱిజనులయొక్క ప్రేమకుఁ బాత్రుఁడై యుండుట, నిజంబుగన్ = నిశ్చయముగా, కల్గినపుణ్యశాలికిన్ = కలిగినపుణ్యముచే నొప్పువానికి, ఒక్కొకయెడన్ = ఒక్కొక్కసమయమందు, ఆపద = కీడు, ఐనన్ = కలిగినను, తడవు ఉండదు = చిరకాల ముండదు, వేగమె = శీఘ్రముగానే, పాసిపోవున్ = నశించునుగదా. ఎట్లనఁగా: అకలుషమూర్తి - అకలుష = నిష్కళంకమైన, మూర్తి = బింబము గలవాఁడు, ఐనయమృతాంశుఁడు = అయినట్టిచంద్రుఁడు, తన్నున్, రాహువు = రాహుగ్రహము, మ్రింగన్ = మ్రింగినప్పటికిని, టకటక = ఆతొందరపాటును, మాని = విడిచి, దృఢస్థితిన్ = స్థిరమైనయునికిచేత, ఎప్పటియట్ల = వెనుకటివలెనే, ఉండఁడె = కాంతిగలిగియుండఁడా ? అనఁగా నుండు నని యర్థము.

తా. నిష్కలంకుఁడైనచంద్రుఁడు తాను రాహువుచే మ్రింగఁబడి కాంతి లేనివాఁ డయినను తిరిగి కొద్దికాలములోనే తన యెప్పటికాంతిని బొందుచున్నాఁడు. అట్లే సర్వజనులకుఁ బ్రియుఁడై యుండినపుణ్యాత్మున కొకప్పుడు కష్టములు వచ్చియుండుటచే సుఖహీనుఁడైనను నాయుత్తరక్షణముననే వాఁ డాయాపదను విడిచి యెప్పటియట్ల సుఖములొందును.

పురా. రాహువు: వీఁ డొక రాక్షసుఁడు. వీనితల్లి సింహిక. విష్ణువు మోహినీదేవి యై దేవదానవుల కమృతము పంచిపెట్టుచుండఁగా వీఁడు కుటిలుఁడై రాక్షసులలోఁ గూర్చుండక దేవతలతోఁ గూర్చుండెను. అంత సూర్యచంద్రు లాసంగతి విష్ణువునకుఁ దెలుప నతఁడు తనచక్రముచే వీనిశిరస్సు ఖండించెను గాని యమృతసంపర్కముచేఁ దలయు మొండెమును బ్రదికియుండి యందులోఁ దల రాహువును మొండెము కేతువు నాయెను. వీరు సూర్యచంద్రులు తమకుఁ జేసినయపకారమును మనమున నిడుకొని వారిని బాధించుచుందురు.

ఉ. సన్నుతకార్యదక్షుఁ డొకఁ డొక చాయ నిజప్రభ యప్రకాశ మై
యున్నపుడైన లోకులకు నొండొక మేలొనరించు సత్త్వసం
పన్నుఁడు భీముఁ డాద్విజులప్రాణము గావఁడె యేకచక్రమం
దెన్నికగా బకాసురుని నేపున రూపడఁగించి భాస్కరా.

టీ. భాస్కరా! సన్నుతకార్యదక్షుఁడు-సన్నుత=కొనియాడఁబడుచున్న, కార్య=పనియందు, దక్షుఁడు = సమర్థుఁడైనమానవుఁడు, ఒకచాయన్ =ఒకపట్టున, నిజప్రభ=తనకాంతి, అప్రకాశము ఐ=స్పష్టముకానిది యయి, ఉన్నపుడైనన్=ఉన్నసమయమందైనను, లోకులకున్ = జనులకు, ఒండొక మేలు = ఒకయుపకారము, ఒనరించున్=చేయుచుండును. ఎట్లనఁగా: సత్త్వసంపన్నుఁడు = బలముతోఁ గూడియున్న, భీముఁడు=కుంతికుమారుఁడైనభీముఁడు, ఏకచక్రమందున్=ఏకచక్ర మనెడునగ్రహారమందు, ఎన్నికగాన్=ప్రసిద్ధిగా, బకాసురుని=బకుఁ డనెడురాక్షసుని, ఏపునన్=పరాక్రమముచే, రూపు అడఁగించి=రూపనాశముచేసి-అనఁగాఁ జంపి, ఆద్వి

-జుల[ప్రాణములు=ఆ[బ్రాహ్మణుల[ప్రాణములను, కావఁడె = రక్షింప లేదా? అనఁగా రక్షించె ననుట.

తా. పూర్వము భీముఁడు తా నేకచక్రమునందు బ్రాహ్మణ వేషము వేసికొని బిచ్చమెత్తుచు నున్నప్పటికి, నాయూరివారి కందఱికి శత్రు వగుబకాసురుని జంపి బ్రాహ్మణులప్రాణముల రక్షించినాఁడు. అట్లె లోకమునఁ గార్యదక్షుఁ డగుమానవుఁ డొకప్పుడు తా నప్రకాశుఁ డై యున్నను లోకుల కుపకారమునే చేయుచుండును.

పురా. బకాసురుఁడు: వీఁడొకరక్కసుఁడు. వీఁ డేకచక్రపురమునకు సమీపమున నున్నయొకగుట్టమీఁద వసించుచుండెను. వీఁ డొక్కమా ఱాగ్రామవాసుల నందఱిని దినుటకుఁ బూనుకోఁగా వారందఱు ప్రతిదిన మొక్కొకనిచొప్పనఁ దినుమని వేఁడుకొనిరి. వాఁ డందుల కంగీకరించి యేకచక్రపురవాసులచే నంపఁబడు మనుష్యుని దినుచు జీవించుచుండెను. ఇట్లు చిరకాలము జరిగిన పిమ్మట నొకబ్రాహ్మణుఁడు పోవలసియుండెను. అతఁ డందులకు విచారించుచుండఁగా దైవవశమున వచ్చియచ్చట వసించియున్న కుంతీదేవి యాయుదంత మెఱిఁగి బ్రాహ్మణునియొద్ద కేఁగి యాతని విచారముఁ బాపి యతనికి మాఱుగాఁ దనకుమారుఁ డగుభీముని బంపెను. అంత నతఁడు మహాబలుఁడు గావున నాబకాసురుని జంపి యాబ్రాహ్మణుని ప్రాణమే కాక యాయూరివారియందఱియుసురులను గూడ దక్కించెను.

చ. సరసగుణ ప్రపూర్ణునకు ♦ సన్నపుదుర్గుణ మొక్క వేళయం
దొరసిన నిట్లు నీకుఁ దగునో యని చెప్పిన మాననేర్చుఁగా
బురద యొకించుకంత తముఁ ♦ బొందినవేళల జిల్లవిత్తుపై

నొరసిన నిర్మలత్వమున నుండవె నీరములెల్ల భాస్కరా.

టీ. భాస్కరా! సరసగుణప్రపూర్ణునకున్ = మనోహర మగు గుణములచే నిండినవానికి, సన్నపుదుర్గుణము = చిన్న దగు చెడు గుణము, ఒక్కవేళయందున్ = ఒకసమయమందు, ఒరసినన్ = కలిగిన చో, ఇట్లు నీకున్ తగున్ ఓ = ఇట్లు చేయుట నీకుఁ దగునా, అని చెప్పినన్ = అని చెప్పినచో, మానన్ నేర్చున్ కా = మానివేయును గదా, బురద తాన్ = ఆబురద, ఒకించుకంత = కొంచెము, తమున్ = ఆనీరములను నంటు, పొందిన వేళలన్ = పొందినట్టిసమయములందు, జిల్లవిత్తు = ఇందువుగాయగంధము, పైన్ = తమపైని, ఒరసినన్ = తాఁకినచో, నీరములు ఎల్లన్ = నీరము లన్నియు, నిర్మలత్వమునన్ = శుభ్రత్వముచే, ఉండవే = తేరి స్వచ్ఛముగా నుండవా?

తా. నీరము లొకప్పుడు బురద గలవైనను నిందువుగాయ గంధ మందులోఁ గలిపిన నాకలుషత్వమును బాసి నిర్మలము లగును. అట్లే మంచిగుణములు గలవాని కొకదుర్గుణ మున్నచో నది తగదని యెవ్వరయినఁ జెప్పినచో దానిని విడిచి వర్తించును.

చ. సరసదయాగుణంబు గలదాత మహిం గడునొచ్చియుండియుం
దడచుగ వాని కాసపడి దాయఁగ వత్తురు లోకు లెట్లనం
జెఱకురసంబు గానుఁగను జిప్పిలిపోయినమీఁదఁ బిప్పి యై
ధరఁబడియున్నఁ జేర వె ముదంబునఁ జీమలు పెక్కు భాస్కరా.

టీ. భాస్కరా! సరసదయాగుణంబు - సరస = రసయుక్తమైన, దయాగుణంబు = కరుణ యనెడుగుణము, గలదాత = కలిగిన నేర్పరి (అనఁగా దాత), మహిన్ = భూమియందు, కడున్ = మిక్కిలి, నొచ్చియుండియున్ = నలఁగియున్నప్పటికిని (అనఁగా ద్రవ్యము లేక బాధ పడుచున్నను), దడచుగన్ = విస్తారముగా, లోకులు = జనులు,

వానికిఁ=ఆబాధపడుచున్న దాతనిమిత్తము, ఆసపడి=ఆసించు కొని, దాయఁగన్ వత్తురు=దగ్గఱ వచ్చుచుందురు. ఎట్లనఁగా= గానుఁగన్=గానుఁగవలన, చెఱకురసంబు=చెఱకుఁగఱ్ఱయొక్క రసము, చిప్పిలిపోయినన్=కాఱిపోఁగా, మీఁదన్=అటుతర్వాత, పిప్పి ఐ=రసము లేనిదై, ధరన్=భూమిమీఁద,పడియున్నన్=పడిన ప్పటికిని, పెక్కుచీమలు, ముదంబునన్=సంతసముతో, చేరవె= చేరియుండవా? అనఁగాఁ జేరునని యర్థము.

తా. చెఱకుగడయొక్క రస మంతయు గానుఁగవలనఁ దీయఁ బడినపిమ్మట నాపిప్పియొద్దకే చీమలు సంతసముతోఁ జేరుచు న్నవి. అట్లే దాత ధనహీనుఁడై యున్నప్పటికిని లోకులు వాని యొద్దకే పోవుచుందురు.

ఉ. సారవివేకవర్తనల సన్నుతి కెక్కినవారిలోపలం
జేరినయంత మూఢులకుఁ జేపడ దానడ యెట్టు లన్నఁగా
సారములోన హంసములసంగతి నుండెడికొంగపిట్ట కే
తీరునఁ గల్గనేర్చును తదీయగతుల్ దలపోయ భాస్కరా.

టీ. భాస్కరా ! సారవివేకవర్తనలన్-సార=బలమైన, వివేక= యుక్తాయుక్తజ్ఞానము గల, వర్తనలన్=నడవడులచే, సన్నుతి కిన్=ప్రసిద్ధికి, ఎక్కినవారిలోపలన్=ఎక్కినమనుష్యులలో, చేరిన యంత=చేరినంతమాత్రమున, మూఢులకున్=అవివేకులకు, ఆ నడ=ఆ గొప్పవారియొక్క ప్రవర్తన, చేపడదు=లభింపదు, ఎట్టు లన్నన్=ఎలాగనఁగా, కాసారములోనన్=సరస్సులో, హంసముల సంగతిన్=అంచలయొక్క కూడికతో, ఉండెడికొంగపిట్టకున్=ఉ న్నట్టికొంగకు, తదీయగతుల్=ఆయంచలగమనములు, తలపో

యన్ = ఆలోచింపఁగా, ఏతీరునన్ = ఏవిధముగా, కల్గనేర్చును = కలిగెడిని? అనఁగా కలుగదని యర్థము.

తా. తామరకొలఁకులో హంసములతోఁ గలసి యెల్లప్పుడు తిరుగుచున్నను నాయంచలగమనము కొంగపిట్టకుఁ గలుగ నేరదు. అట్లే లోకములో మంచివర్తనలచే వాసిని గన్నమానవులతో నెంతకాలము కలిసియున్నను వారియొక్క మంచిప్రవర్తన మూఢజనులకుఁ గలుగనేరదు.

ఉ. స్థానము తప్పివచ్చునెడఁ దా నెటువంటిబలాఢ్యుఁడున్ నిజ
స్థానికుఁ డైనయల్పునికతంబున నైనను మోసపోవుఁగా
కానలలోపల న్వెడలి గంధగజం బొకనాఁడు నీటిలోఁ
గానక చొచ్చినన్ మొసలికాటుకు లోఁబడదోటు భాస్కరా.

టీ. భాస్కరా! తాన్ = తాను, ఎటువంటిబలాఢ్యుఁడున్ = ఎంత బలము గలవాఁడయినను, స్థానమున్ = స్వస్థలమును, తప్పి = విడిచి, వచ్చునెడన్ = వచ్చునట్టిసమయమునందు, నిజస్థానికుఁడు = స్వస్థలమందున్నవాఁడు, ఐనయల్పునికతంబున నైనన్ = అయినట్టినీచునివలననైనను, మోసపోవును = వంచింపఁబడును. ఎట్లనః గంధగజంబు = గంధజాతియేనుఁగు-గజేంద్రుఁ డనుట, ఒకనాఁడు = ఒకదినమున, కానలలోపలన్ = అడవులలోనుండి, వెడలి = బయలుదేఱి, కానక = చూడక, నీటిలో, చొచ్చినన్ = ప్రవేశింపఁగా, మొసలికాటుకున్ = మకరినోటికాటునకు, లోఁబడదోటు = లొంగిపోయినది కాదా? అనఁగా లోఁబడినదని యర్థము.

తా. గజేంద్రుఁడు బలశాలి యయినను తనవనమును విడిచి వచ్చి నీటిలోఁ బ్రవేశించినంతమాత్రమున క్షుద్రజంతు వగు మొసలికి లోఁబడినది. అట్లే లోకమందు మనుజులు తా మెంత

బలము కలవారయినను దమస్థానములను విడిచివచ్చినప్పుడు స్వస్థలమం దున్నయల్పులవలననే వంచింపఁబడుచుందురు.

పురా. పూర్వ మొకప్పుడు గజరాజు తనతోడిగజములతోఁ గూడి విహరించుచు శ్రమను జెంది దప్పి గొని యొకమడువును జొచ్చి నీరు ద్రావుచుండెను. అంత నం దున్న మొసలి యొకటి వచ్చి యతనికాలొడిసిపట్టి నిర్బంధించెను. ఆగజేంద్రుఁడు నూరకుండక తనబలముకొలఁదిని మొసలితోఁ బోరాడెను. వేయి వత్సరము లిట్లు పోరాడినను మొసలిని జయింపనేరక క్రమక్రమముగా బలహీనుఁడు కాఁజొచ్చెను. అంత నతఁడు చేయునది లేక జగన్నాయకుఁ డగువిష్ణుపాదపద్మముల స్మరింపఁగా నాతం డను గ్రహించి మొసలిని దనచక్రముచేఁ దునిమి గజరాజును దన పదంబునకుఁ గొనిపోయెను.

వ్యా. ఈపద్యము నాల్గవపాదమున "మొసలికాటుకు లోఁబడ దోటు" అనునెడ మొసలికాటుకు అని ప్రయోగించుట తప్పు; మొసలికాటునకుఁ అని ప్రయోగింపవలయును. అట్లున్న ఛందోభంగ మగును. కావున "మొసలిగాసికి" అని పఠించినచో నుచితమని తోఁచెడిని.

చ. సిరి గలవాని కెయ్యెడలఁ జేసినమే లది నిష్ఫలం బగున్
నెఱిగుఱి గాదు పేదలకు నేర్పునఁ జేసిన సత్ఫలం బగున్
వఱపున వచ్చి మేఘుఁ డొకవర్షము వాడినచేలమీఁదటం
గురిసినఁగాక యంబుధులఁ గుర్వఁగ నేమిఫలంబు భాస్కరా.

టీ. భాస్కరా ! సిరి=సంపద, కలవానికిన్=కలిగినవానికి, ఎయ్యెడలన్=ఏసమయములయందును, మేలు=ఉపకారము, చేసినన్=చేసినచో, అది=ఆచేసిన మేలు, నిష్ఫలంబగున్=వ్యర్థమగును.

నెఱి=పూర్తి యైన, గుఱి కాదు=లక్ష్య ముండదు, పేదలకున్ = బీదవారికి, నేర్పునన్ = ఉపాయము చే, చేసినన్ = మేలొనరించిన చో, సత్ఫలము=మంచిఫలము కలది, అగును. ఎట్లనఁగా: మేఘుఁడు= మబ్బు, వఱపునన్ = వాన లేబరం బగుకాలంబున, ఒక వర్షమున్ = ఒక వానను, వాడిన చేలమీఁదటన్ = వాడుపాఱు చున్న సస్యములపై, కురిసినఁగాక = వర్షించిన నే కాని, లాభ మగును గాని(అనఁగా వాడిన చేలపై వర్షించుటచే జనులవలన మెప్పును బొందుననుట) అంబుధులన్ =సముద్రములయందు,కుర్వఁగన్ =వర్షింపఁగా,ఏమిఫలంబు=ఏమిలాభము కలదు? అనఁగా ఫలము లేదని యర్థము.

తా. మేఘుఁడు వానలు లేక ఎండిపోవుచున్న సస్యములపై వర్షించిన చో,జనులవలనఁ బొగడ్త యను ఫలంబును జెందును గాని సముద్రములలో నెంత వర్షించినను లాభము పొంద లేఁడు. అట్లే మానవుఁడు పేదవానికి మేలు చేసినను ఫలము చెందియుండును గాని సంపద గలవానికి మేలుచేయుటవలన నేమియును లాభమును జెంద లేఁడు.

చ. సిరి వలెనేని సింహగుహ చెంత వసించినఁ జాలు సింహముల్
కరుల వధింపఁగాన చటఁ గల్గు సుదంతచయంబుమత్యముల్
హరువుగ నక్కబొక్కకడ నాశ్రయమందిన నేమి గల్గెడుం
గొరిసెలుమాడతోఁకలును గొమ్ములునెమ్ములుగాక భాస్కరా.

టీ. భాస్కరా! సిరి=సంపద, వలెనేని=కావలసియున్న చో, సింహగుహ చెంతన్ - సింహగుహ=సింహము వసించియున్న గుహ యొక్క, చెంతన్=సమీపమున, వసించినన్=నివసించినచో, చాలున్=సరిపోవును, ఏమనఁగా,సింహముల్, కరులన్ =ఏనుఁగులను, వధింపఁగా= చంపుచుండును గనుక, దంతచయంబు=ఏనుఁగు

దంతములయొక్క సమూహము, ముత్యముల్ = ఏనుఁగుల కుంభస్థలముల నున్నముత్యములు, అచటన్ = ఆసింహము నివసించెడిస్థలమున, కల్గును = దొరకును. వానిని గొనివచ్చి యమ్ముకొన్నచో ధనవంతు లగుదు రని యభిప్రాయము. ఎట్లనన్ = ఏలాగన ననఁగా, హరువుగన్ = బాగుగ, నక్కబొక్కకడన్ = నక్క నివసించెడికన్నము దగ్గఱ, ఆశ్రయము అందినన్ = ఆశ్రయించినచో, గొరిసెలు = గిట్టలును, దూడతోఁకలు = దూడలయొక్క తోఁకలు, కొమ్ములు = చచ్చినవృషభాదులకొమ్ములును, ఎమ్ములు = వానియెముకలు, కాక = తప్ప, ఏమి గల్గెడున్ = ఏమి లభించెడిని? ఏమియు దొరకదని యర్థము.

తా. ఐశ్వర్యము గోరునట్టివారు నేనుఁగుల సంహారించుటవలన రాలిపడియున్న దంతములు ముత్యములు గలిగినసింహముయొక్క గుహచెంతకుఁ బోవలయును గాని యెముకలు మొదలగు నీచ వస్తువులతో నిండియున్న నక్కబొక్కదగ్గఱ నాశ్రయించిన నేమి లాభము.

చ. స్థిరతరధర్మవర్తనఁ బ్రసిద్ధికినెక్కినవాని నొక్కము
ష్కరుఁ డతినీచవాక్యములఁ గాదని పల్కిన నమ్మహాత్ముఁడుం
గొఱఁత వహింపఁ డయ్యెడ నకుంఠితపూర్ణసుధాపయోధిలో
వరుగుచుఁ గాకి రెట్ట యిడినందున నేమికొఱంత భాస్కరా.

టీ. భాస్కరా! ఒక్కముష్కరుఁడు = ఒకమూర్ఖుఁడు, స్థిరతర ధర్మవర్తనన్ - స్థిరతర = మిగులదృఢమైన, ధర్మవర్తనన్ = న్యాయ ప్రవర్తనచేత, ప్రసిద్ధికిన్ ఎక్కినవానిన్ = వాసి చెందినవానిని, అతినీచవాక్యములన్ = మిక్కిలితుచ్ఛము లగుమాటలచే, కాదు అని = తిరస్కరించి, పల్కినన్ = మాట్లాడినప్పటికిని, అయ్యెడన్ = అ

ట్లు తిరస్కరించిపల్కునసమయమందు, అమ్మహాత్ముఁడుఁ = ఆగొప్పవాఁడును, కొఱఁతఁ=లోపమును,వహింపఁడు=పొందఁడు. ఎట్లనఁ: కాకి, అరుగుచుఁ=ఆ కాశముమీఁదనుండిపోవుచు,అకుంఠితపూర్ణసుధాపయోధిలోఁ-అకుంఠిత=తక్కువకాని, పూర్ణ=నిండయిన; సుధాపయోధిలోఁ=అమృతసముద్రములో, రెట్ట ఇడినందునఁ=రెట్ట వేసినంతమాత్రమున, ఏమికొఱంత = ఆసముద్రమునకు నేమిలోపము కలుగును. అనఁగా నెట్టిలోపము లేదనియర్థము.

తా. కాకి తనమీఁదనుండి పోవుచు,నిండయినయమృతసముద్రములో రెట్టవైచినందువలన నాసముద్రమునికి లోపము లేదు. అట్లె ధర్మప్రవర్తనచే వాసి కెక్కినమహానుభావు నొకమూర్ఖుఁడు తిరస్కరించిపలికినను దానివలన సుంతేనియు లోపము చెందఁడు.

చ. స్ఫురతరకీర్తిమంతు లగుసత్పుత్రులఁ గాంచినఁగాక మూఢము
ష్కరులఁ గనంగఁ దేజములు గల్గవుగా మణికీలితాంగుళా
భరణము లంగుళంబుల శుభస్థితిఁ బెట్టినఁగాక గాజుటుం
గరములు పెట్టినందున వికాసము గల్గునటయ్య భాస్కరా.

టీ. భాస్కరా! స్ఫురతరకీర్తిమంతులు=మిక్కిలి ప్రకాశించు కీర్తిగలవారు, అగుపుత్రులఁ=అయినట్టికుమారులను, కాంచినఁగాక = కాంచినచో లాభముగాని, మూఢముష్కరులఁ=జ్ఞానహీనులైనమూర్ఖులను, కనఁ కఁ=కన్నట్టయిన, తేజములు=ప్రతిష్ఠలు, కల్గవు కా = కల్గవుగదా. ఎట్లనఁ: మణి ... భరణములు-మణి=రత్నములచే, కీలిత=స్థగితమైన, అంగుళాభరణములు=ఉంగరములు, అంగుళంబులఁ=వ్రేళ్లయందు, శుభస్థితిఁ=శుభకరముగా, పెట్టినఁ గాక=ధరించిననే కాని, గాజుటుంగరములు, పెట్టినందునఁ=ధరించుటవలన, వికాసము = కాంతి, కలుగునట

య్యె = కలుగున్నా? అనఁగా వికాసము కలుగ దనియర్థము.

తా. చేతివ్రేళ్ల యందు మణులచేఁ గూర్పఁబడినయుంగరము
లు ధరించినచోఁ జేతికిఁ గాంతికలుగునుగాని గాజుటుంగరములు
పెట్టిన వికాసము కలుగదు. అట్లె కీర్తిమంతు లగుపుత్త్రులను
గన్నచోఁ బ్రతిష్ఠ వచ్చునుగాని వట్టిమూర్ఖులను గన్నచో నేమి
లాభము.

ఉ. నేనగ వాంఛితాన్నము భుజింపఁ గలప్పుడు గాక లేనిచో
మేనులు డస్సియుంట నిజమే కద దేహుల కగ్నిహోత్రుఁ డౌ
నే నిజభోజ్యముల్ గుడుచు నేనియుఁ బుష్టివహించు లేనినాఁ
డూని విభూతిలో నడఁగియుండఁడె తేజము తప్పి భాస్కరా.

టీ. భాస్కరా! నేనగ = అధికముగా, వాంఛితాన్నము=ఇష్ట
మైనయన్నమును, భుజింపఁగలప్పుడు=భుజించుసమయమునందు,
కాక=తప్ప, లేనిచో=అట్టియాహారము లేనప్పుడు, దేహులకున్ =
జంతువులకు, మేనులు=శరీరములు, డస్సి = కృశించియుండుట, ని
జము ఏకద=నిశ్చయమేకదా? ఎట్లనన్: అగ్నిహోత్రుఁడు ఔనేని=
అగ్నిహోత్రుఁడైనప్పటికిని, నిజభోజ్యముల్ = తాను భుజింపఁదగిన
యాహారపదార్థములు, కుడుచునేనియున్ = తినునట్టయిన, పు
ష్టి=వృద్ధిని, వహించున్=పొందును, లేనినాఁడు=అట్టియాహారము
లేనిసమయమునందు, తేజమున్ = కాంతిని, తప్పి=విడిచి, ఊని=
ఆనుకొని, విభూతిలోన్=బుగ్గిలో, అణఁగియుండఁడె=ప్రచ్ఛన్నుఁ
డై యుండలేదా? అనఁగా బూదికప్పుకొని యుండు ననియర్థము.

తా. మిగులఁ దేజశ్శాలి యయినప్పటికి నగ్నిహోత్రుఁడు తన
యిష్టపదార్థములను దిన్నప్పుడు పుష్టి వహించి కాంతి గలవాఁ
డగును గాని యది లేనిచో బూదిలో నడఁగియుండును గనుక

మానవుఁడు తనకిష్టమైనపదార్థములు తిన్నచో శరీరకాంతి గలిగి యుండునుగాని యట్టిభోజనము లేనిచో మిగులఁగృశించుచుండును. తిండి లేనప్పు డగ్నిదేవుఁడే కాంతి దప్పుచున్నప్పుడు మనుష్యుల మాట చెప్పనేల? అని కిముతిన్యాయమునకు విషయమగుచున్నది. కనుక నర్థాపత్తి.

ఉ. హాళి నిజప్రబుద్ధి తిరమైనవిధంబునఁ బెట్టుబుద్ధులా
వేళల కంతె కాని మఱి వెన్కకు నిల్వవు హేమకాంతి యె
న్నాళుల కుండుఁగాని యొకనాఁడు పదంపడి సానఁబట్టినన్
దాళుక యుండునే యినుపతాటకుఁ జాయలుపోక భాస్కరా.

టీ. భాస్కరా! హాళిన్ = ఆసక్తిచేత, నిజప్రబుద్ధి = స్వతస్సిద్ధముగాఁ బుట్టినబుద్ధి, తిరము = నిలుకడగానుండునది, ఐనవిధంబునన్ = అగున ట్టుగా, పెట్టుబుద్ధులు = ఒకరు నేర్పినబుద్ధులు, ఆవేళకున్ = ఆదినము మాత్రమే నిలిచియుండును, అంతెకాని, మఱి వెన్కకున్ = తరువా తికాలమునకు, నిల్వవు = నిల్చియుండవు. ఎట్లన: హేమకాంతి = బం గారుతళుకు, ఎన్నాళులకైనన్ = ఎన్నిదినములకయినను, ఉండును గాని = నిలిచియుండునుగాని, ఒకనాఁడు = ఒకదినమెల్ల, పదంపడి = వెనుక, సానఁబట్టినన్ = సానఁబట్టినచో, ఇనుపతాటకున్ = ఇనుపఱే కునకు, చాయలు = తళుకులు, పోక = నశింపక, తాళుకయుండునే = నిలిచియుండునా? అనఁగా నిలువవనియర్థము.

తా. స్వతస్సిద్ధముగాఁ బుట్టినబుద్ధి హేమకాంతివలెను స్థిర ముగానుండునుకాని పరులు చెప్పుటవలనఁ గలిగినబుద్ధి సానఁబట్టి నయినుపఱేకుతళుకులవలె నాదినముమాత్రమేయుండి నశించును.

విశే. ఈపద్యము నాల్గవపాదమున నున్న 'తాళుక' అనుపద ము 'తాళుకొని' అనుదానియపభ్రంశరూపము. కావునఁ 'దా

-ఖుచునుండునే యని పఠించుట యుచితము.

ఉ. హీనకులంబునందు జనియించినవారికి సద్గుణంబు లె
న్నేనియుఁ గల్గియున్న నొకనేరము చెందకపోదు పద్మముల్
భూనుతి గాంచియుం బురదఁ బుట్టుటవల్లసుధాకరోదయం
బైన సహ్యమొందవె ప్రియంబునఁజూడఁగలేక భాస్కరా.

టీ. భాస్కరా! హీనకులంబునందున్ = తక్కువకులమందు, జని యించినవారికిన్ = పుట్టినవారికి, సద్గుణంబులు = మంచిగుణంబులు, ఎన్నేనియున్ కల్గియున్ = ఎన్నిగుణములు కలిగియున్నను, ఒక నేరము = ఒకదోషము, చెందకపోదు = ఉండకమానదు, అనఁగా నుండు నని యర్థము. ఎట్లనిన: పద్మముల్ = తామరపూవులు, భూనుతి = భూలోకజనులయొక్క స్తోత్రమును. కాంచియున్ = పొందుచున్నప్పటి కిని, బురదన్ = అడుసునందు, పుట్టుటవల్లన్ = జనియించు టనెడుదో షముచే, సుధాకరోదయంబు ఐనన్ = చంద్రోదయమైనప్పుడు, ప్రియంబునన్ = ప్రేమతో, చూడఁగలేక = చూడలేక, అసహ్యము ఒందవె = రోఁతను జెందవా? అనఁగాఁ జెందునని యర్థము.

తా. పద్మములు లోకమున మిగులఁ బ్రసిద్ధికెక్కినప్పటికిని బు రదయందుఁబుట్టుటవలనఁగలిగినదోషము చేతనే చంద్రోదయసమ యమునం దయిష్టముతోఁ జూచుచుండునుగాని ప్రియముతోఁ జూడవు, అట్లే నీచకులమందుపుట్టినమానవుఁ డెన్నిసద్గుణములు కలవాఁడైనను ఒకనీచగుణమునుగూడఁ దప్పక కలిగియుండును.

ఉ. ఇంచుక నేర్పు చాలక వివేకహీనతఁ జెందినాకవిత్వమున్
మించు వహించె నీకతనకమిక్కిలి నొట్లనఁ దోలుబొమ్మలన్
మంచివివేకి వానితెరకమాటుననుండి ప్రశస్తకీతి నా
డించినయాడవే జనులకెందము నింపవె ప్రీతి భాస్కరా.

టీ. భాస్కరా=సూర్యుఁడా! ఇంచుక=కొంచెము, నేర్పు=చాతుర్యము; చాలక, విహీనతన్=చుల్కదనమును, చెందిననాకవిత్వమున్=పొందినట్టినాకవిత్వముగూడ, నీకతనన్=నీనామధేయమును బద్యాంతములజేర్చినకారణమున, మిక్కిలి=అధికముగా, మించువహించెన్=ప్రకాశించెను. ఎట్లనఁగా: మంచివివేకి=మంచితెలివిగలవాఁడు, తోలుబొమ్మలన్, వానితెరమాటునన్=వానియొక్క తెరచాటున, ఉండి=వసించి, ప్రశస్తరీతిన్=బాగుగా, ఆడించినన్=ఆడించినచో, ఆడవే=ఆడుచుండలేదా? ప్రీతిన్=సంతసముచే, జనులడెందము=జనులయొక్క మనస్సును, నింపవె=నింపలేదా? అనఁగా నింపుచున్నవని యర్థము.

తా. నేర్పరి యగుమానవుఁడు తెరచాటున నుండి నేర్పలరునట్టుగాఁ దోలుబొమ్మల నాడించుచుండ నవి యాడుచు జనులకమితానందమును గలిగించుచున్నవి. అట్లె ఓసూర్యుఁడా! నాపద్యములచివరను జేర్పఁబడిననీపేరు సరసము కానిదైనను నాకవిత్వమును రసవంతముగాఁ జేసినందున మానవులయొక్క డెందమున కానందమును గూర్పకపోదు.

భాస్కరశతకము

సమాప్తము.

